
CHANDAMAMA

ఇప్పుడు, కుట్టడానికోసం తయారుగావున్న జీన్స్‌ని తయారుచేసే అందరికన్న పెద్ద నిర్మాతయిచ్చే ఓ చిన్న, తీరైన అందింపు.

అందిస్తున్నాం రఫ్ అండ్ టఫ్ జూనియర్ జీన్స్ ! రఫ్ అండ్ టఫ్ కిట్‌లో మీకు అందుతాయి పూర్తిగా 0.85 మీటర్ల మేలైన డెనిమ్ బట్టా. (132 సెం.మీ. ఎత్తుదాకాగల వారికోసం) గట్టి జిప్, దర్జా అయిన లేబుల్, రివెట్స్, బటన్స్ మరియు ప్యాచెస్. అంటే ఇప్పుడు జూనియర్ కూడా అయిపోవచ్చు రఫ్ అండ్ టఫ్.




A QUALITY PRODUCT FROM ARVIND MILLS

JUNIOR

కుట్టడానికోసం-తయారుగావున్న జీన్స్



# శ్రీమతి శేషమ్మ

**[1916–1997]**

ఆమె మనసు ఎంతటి సున్నితమో, భావాలు అంతటి సునిశితం. సహజమైన చిరునవ్వుతో అందర్నీ పలకరిస్తూ, ఎవర్నీ నొప్పించకుండా, తానొచ్చినా, నొచ్చినట్లు కనిపించకుండా, ఎటువంటి ఇబ్బందీ, విపత్తూ వచ్చినా తొణకని నిండుకుండలా వుంటూనే, తేలిగ్గా పరిష్కరించడానికి ప్రయత్నిస్తూ, అందరూ కలిసిమెలిసి ఒక కుటుంబంలా వుండాలని అనుక్షణం కోరుకున్న మా ప్రియతమ మాతృమూర్తి - శ్రీమతి బి.శేషమ్మ - ఆకస్మికంగా 12 జనవరి 1997న మమ్మల్ని విడిచి వెళ్లిపోయారు. ప్రతి పురుషుడి విజయం వెనుక ఒక స్త్రీ వుంటుందంటారు. విజయాధినేత, చందమామ వ్యవస్థాపకులు శ్రీ బి. నాగిరెడ్డిగారి విజయాల వెనుక-స్ఫూర్తి, దీప్తి శ్రీమతి శేషమ్మగారే! ఆ దయార్ద్రహృదయిని కేవలం కన్న బిడ్డలకి మాత్రమే గాక, తనని ఆశ్రయించిన వారందరికీ మాతృమూర్తిగా చేయూతనందించారు. పరులకి మంచి చేయడమే కానీ, ఆ మంచి పనికి ప్రచారమంటే గిట్టని మితభాషిణి అయిన ఆమె సుఖదుఃఖాలను సమానంగా స్వీకరించగల ధృఢచిత్తురాలు. ఎలాంటి ఆధిపత్యమూ చెలాయించకుండానే అందరి విధేయతను పొందగలిగిన సేవాపరాయణురాలు ఆమె. అంతటి సువిశాలమైన, సున్నితమైన హృదయం గల మహా మనిషిని - క్రూర విధి హఠాత్తుగా కబళించి వేసింది. మమ్మల్ని అనాథలుగా విసిరివేసింది! ఆమె లేనిలోటు మాటల్లో చెప్పడానికి వీలులేని లోటే అయినా, ఆమె ఆశయాలకు అనుగుణంగా నడుచుకుంటూ, ఆమె బాటలో పయనిస్తామని, అదే ఆమెకు శాశ్వత స్మారక చిహ్నం కాగలదని భావిస్తూ, బరువైన మనసుతో ఆమెకు అంజలి ఘటిస్తున్నాము.

- నిర్వాహకులు

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'   సంచాలకుడు : నాగిరెడ్డి









## ర్యాగింగ్ నిషేధం!

పరీక్షలంటే విద్యార్థులు భయపడడం సహజం. ఇప్పుడు ర్యాగింగ్ అన్నా కళాశాల విద్యార్థులు హడలిపోతున్నారు. ఒకప్పుడు సరదాగా భావించబడిన ర్యాగింగ్ ఇవాళ పలువురి విమర్శలకూ, ఖండనలకూ, ఆక్షేపణలకూ గురయింది!

కళాశాలలలో, ముఖ్యంగా వైద్యకళాశాల వంటి వృత్తికళాశాలలలో కొత్తగా చేరిన విద్యార్థులను పాతవిద్యార్థులు సరదాగా పాడమనేవారు; ఆడమనేవారు; తెలిసిన హాస్యోక్తులను చెప్పమని ఆటపట్టించేవారు. ఈరకం ర్యాగింగ్, కొత్తవిద్యార్థులలోని సంకోచ స్వభావం తొలగడానికీ, పాత,కొత్త విద్యార్థుల మధ్య పరిచయాలు ఏర్పడి పరస్పర అవగాహన పెరగడానికీ దోహదం చేసేది. అయితే, ఈ సంప్రదాయం క్రమంగా మార్పుచెంది పాతవిద్యార్థులు కొత్తవిద్యార్థులను మాటలతో, చేతలతో పరిహసించే దశ దాటి, వారిని వేధించి పైశాచిక ఆనందం పొందే నీచస్థితికి దిగజారింది.

ఉన్నత విద్యకని కళాశాలలో అడుగుపెట్టే విద్యార్థులకు ఈ ర్యాగింగ్ ఒక భయానక స్వప్నంగా తయారయింది. దీనికి భయపడి కొందరు చదువుమానేయడం, మరికొందరుఆత్మహత్యలకు పాల్పడడం వంటివి కూడా జరిగాయి.

ఈ మధ్య తమిళనాడులోని ఒక వైద్యకళాశాల విద్యార్థి దారుణహత్య కూడా ర్యాగింగ్‌కు సంబంధించినదే అని భావిస్తున్నారు!

ఈ దుర్ఘటన విద్యార్థులలో, తల్లిదండ్రులలో, విద్యావేత్తలలో, అధికారులలో తీవ్రమైన ఆందోళనను కలిగించింది. ఆఖరికి తమిళనాడు ప్రభుత్వం విద్యాలయాలలో ర్యాగింగ్‌ను నిషేధిస్తూ ఒక చట్టం చేసింది. ర్యాగింగ్‌కు పాల్పడే వారిని తీవ్రంగా శిక్షించాలని నిర్ణయించింది. ఆంధ్రప్రదేశ్ వంటి మరికొన్ని రాష్ట్రాలు కూడా ఇదే నిర్ణయం తీసుకోనున్నాయి.

ర్యాగింగ్ నిషేధం ద్వారా విద్యార్థుల మధ్య మునుపటి సున్నితమైన స్నేహభావంపెంపొంది. ఉన్నతవిద్యాలయాలలో ఆరోగ్యకరమైన వాతావరణం ఏర్పడగలదని ఆశించవచ్చు!


సంపుటి : 100   ఫిబ్రవరి '97   సంచిక : 2

విడిప్రతి : 6.00   సంవత్సర చందా : 72.00




వార్తలు – విశేషాలు:

# అమెరికా అధ్యక్షుడు

అమెరికా అధ్యక్ష భవనం వైట్‌హౌస్‌లో రెండవసారి అధ్యక్ష పదవీ ప్రమాణం స్వీకారం చేసిన తరవాత విలియం జఫర్‌సన్ క్లింటన్ తనను 20-21 శతాబ్దాల మధ్య వారధి అని చెప్పుకున్నాడు. బిల్ క్లింటన్ అమెరికాకు ఈ శతాబ్దపు చిట్టచివరి అధ్యక్షుడుగానూ, రానున్న శతాబ్దపు మొట్టమొదటి అధ్యక్షుడుగానూ కొన సాగే ప్రత్యేకతను సంతరించుకున్నాడు. అమెరికా 42వ అధ్యక్షుడైన బిల్ క్లింటన్‌కు – రెండవ ప్రపంచ యుద్ధానంతరం రెండవసారి ఎన్నికయిన డెమొక్రాట్ ప్రెసిడెంట్ అనే మరొక విశిష్టతకూడా సమకూరింది.

అమెరికాలో డెమొక్రాట్ ప్రెసిడెంట్ రెండవ సారి ఎన్నిక కావడం అన్నది అరవైయేళ్ళ క్రితం జరిగింది. 1932వసం॥లో మొదట అధ్యక్షుడుగా ఎన్నికయిన ఫ్రాంక్లిన్ డిలానో రూజ్వెల్ట్ మళ్ళీ 1936వ సం॥లో అధ్యక్షుడుగా ఎన్నికయ్యాడు. అంతేకాదు; ఆయన మూడవసారి; నాలగవసారి (1944) కూడా ఆ పదవికి ఎన్నికయ్యాడు. ప్రపంచయుద్ధంఅంతానికివస్తూన్న సమయంలో అయన 1945 ఏప్రిల్ 12వ తేదీ పదవిలో ఉన్నప్పుడే మరణించాడు.

రూజ్వెల్ట్ తరవాత హారీ ఎస్. ట్రూమన్ 1945లో అధ్యక్ష పదవిని చేపట్టాడు. 1960లో మరొక డెమొక్రాట్ నాయకుడు జాన్ కెన్నెడీ అధ్యక్షుడుగా ఎన్నికయ్యాడు. ఆయన 1963 నవంబర్ 22వ తేదీ హత్య చేయబడ్డాడు. ఆయన అనంతరం లిండన్ బి.జాన్సన్ (డెమొక్రాట్) అధ్యక్షుడయ్యాడు. ఆ తరవాత అధ్యక్షుడుగా – ఎన్నికయిన డెమొక్రాట్ నాయకుడు జిమ్మీకార్టర్ (1977-81)

1992వ సం॥లో బిల్ క్లింటన్ మొదటిసారి అధ్యక్షుడుగా ఎన్నికై 1993 జనవరి 20వ తేదీ పదవీస్వీకారం చేశాడు.

వంద సంవత్సరాల క్రితం అంటే ఈ శతాబ్దారంభంలో రిపబ్లికన్ పార్టీకి చెందిన విలియం మెక్లిన్‌లే అధ్యక్ష పదవిలో ఉన్నాడు.

1996 నవంబర్‌లో జరిగిన ఎన్నికలలో క్లింటన్‌కు 49 శాతం ఓట్లు లభించాయి.అయన ప్రధాన ప్రత్యర్థి, రిపబ్లికన్ పార్టీ అభ్యర్థి అయిన రాబర్ట్ డోల్‌కు 41 శాతం ఓట్లూ, ఇండిపెండెంట్ అభ్యర్థిరాస్‌పెరాట్‌కు 8శాతం ఓట్లూ లభించాయి.

జనవరి 21వ తేదీ పదవీస్వీకారం తరవాత తన ప్రారంభ ఉపన్యాసంలో బిల్ క్లింటన్ ప్రధానంగా దేశ సమైక్యతను గురించి ప్రస్తావించాడు. రానున్న నాలుగేళ్ళలో దేశసమైక్యతకు ప్రాముఖ్యత నివ్వగలనని ఆయన అన్నాడు. అమెరికాను, "ఒకేదేశం, ఒకేప్రజ, ఒకే లక్ష్యం" పునాదుల మీద పునర్నిర్మించాలని ఆయన పిలుపునిచ్చాడు. తన ప్రభుత్వం నిరాడంబరంగా, అదేసమయంలో దృఢంగా ఉంటుందని ఆయన చెప్పాడు. "ప్రకాశవంతమైన అమెరికా స్వాతంత్ర్య జ్యోతిని, ప్రపంచమంతా వ్యాపింప జేస్తాము," అని ఆయన వాగ్దానం చేశాడు. ఆ విధంగా 21వ శతాబ్దంలో 'ప్రజాస్వామ్యాల ప్రపంచం' రూపొందగలదని క్లింటన్ ఆశించాడు.





# గోవిందరాజు చిట్కా

గోపాలపురంలో, గోవిందరాజనే తెలివైన వాడుండేవాడు. అతడి ప్రత్యేకత ఏమిటంటే ఎవడైనా ఎదుటివాణ్ణి లౌక్యంగా మోసగిస్తే, ఆ మోసగించినవాణ్ణి తిరిగి అదే లౌక్యంతో మోసపోయేలా చేయడం.

ఒకసారి సుబ్రహ్మణ్యం అనే పురోహితుడు, సుందరసెట్టి ఇంట్లో కేదారనాథవ్రతం చేయించాడు. వ్రతం పూర్తయ్యాక సుందరసెట్టి, సుబ్రహ్మణ్యానికి స్వయంపాకం ఇచ్చి, తాంబూలంలో దక్షిణగా రూపాయిపావలా పెట్టి నమస్కరించాడు.

సుబ్రహ్మణ్యం ఆ అతితక్కువ దక్షిణను బొడ్లో దోపుకుంటూ, "సెట్టిగారూ! నాలుగు రూపాయలిచ్చినా వరహాదక్షిణ ఇచ్చినట్టవుతుంది. బొత్తిగా రూపాయి పావలా,మీతాహతుకు తగ్గట్టులేదు," అన్నాడు.

సెట్టి నవ్వి, "శాస్త్రిగారూ! అచ్చివచ్చినపని చేయడం, మా తాతల కాలంనుంచి వస్తున్న ఆచారం. వాళ్ళకాలం నుంచి యేడు తప్పకుండా కేదారనాథ వ్రతం చేస్తున్నాం. అదే పూజ,అదే కథ! అలాగే అదే దక్షిణ ఇవ్వడం అచ్చి వస్తుందని మా నమ్మకం. అందుచేతే రూపాయి పావలా ఆనవాయితీగా ఇచ్చాను. ఏమీ అనుకోకండి," అన్నాడు.

పురోహితుడు సుబ్రహ్మణ్యం ఏమీ సమాధానం చెప్పలేక, తిరిగివస్తూండగా, దారిలో తన ఇంటి వీధిఅరుగుమీద కూర్చునివున్న గోవిందరాజు కనిపించాడు. సెట్టి తనను తగిన విధంగా గౌరవించలేదని బాధపడుతున్న పురోహితుడు, గోవిందరాజు దగ్గరకు పోయి, అతడి పక్కన కూర్చుని, తను సెట్టి చేత కేదారనాథవ్రతం చేయించి వస్తున్నానని చెప్పాడు.

గోవిందరాజు, పురోహితుడి ముఖంలో ఏమాత్రం సంతోషం లేకపోవడం గమనించి, "సెట్టి ఈ మధ్య వ్యాపారంలో లాభాల మీద

జె. ఉదయనాగశిరీష

లాభాలు గడిస్తున్నాడు. అయినా దక్షిణబాగా ముట్టజెప్పలేదా ఏం?" అని అడిగాడు.

"ఆ సంగతే నీకు చెబుదామని వచ్చాను. సెట్టి చచ్చిన పీనుక్కి, శ్మశానంలో ఎన్నికట్టెలు అవసరపడతాయో అని లెక్కలు తయారు చేసుకుని, కాస్త ఎక్కువ కట్టెలు కాలితే బిగ్గరగాఏడ్చే పిసినిగొట్టు. అచ్చివచ్చిందని చెప్పి రూపాయిపావలా దక్షిణ ఇచ్చాడు," అని జరిగింది చెప్పాడు పురోహితుడు.

ఇది విన్న గోవిందరాజు ఆగకుండానవ్వి, "ఆసెట్టిఅచ్చివచ్చిందికదా అని, తాతల కాలం నాడు ఉన్న ధరలకే వస్తువులు అమ్మడం లేదు. సెట్టి తాతముత్తాతల కాలంలో రూపాయి పావలాకు కుంచెడుబియ్యం వచ్చేవి. ఈనాడు ఐదురూపాయలు. ఇప్పుడు సెట్టి ప్రస్తావించింది, కేదారనాథ వ్రతం రూపాయిపావలా దక్షిణకే చేయించిన, మీ పూర్వీకుల గురించి. అందుచేత నువ్వేం చేస్తావంటే–" అంటూ రహస్యంగా ఏదో సలహా ఇచ్చాడు.

పురోహితుడు ఆ సలహాకు చాలా సంతోషించి, ఆ సాయంత్రం సెట్టి దుకాణానికి వెళ్ళాడు. కుంచెడు బియ్యం కొలిపించుకుని వెళ్ళిపోతూ, సెట్టికి రూపాయిపావలా ఇచ్చాడు. సెట్టి ఆశ్చర్యపోతూ, ఇదేమిటని అడిగాడు.

"సెట్టిగారూ! మీరు మీ తాత ముత్తాతల కాలం నాటి కేదారనాథవ్రతం చేయించుకుని, నన్ను ఆ కాలంనాటి పురోహితుడుగా భావించి అచ్చివచ్చింది కనక, వారిచ్చినట్టే రూపాయిపావలా దక్షిణ ఇచ్చారు. నేను ఆ రూపాయిపావలాను, మా తాతముత్తాతల కాలంలోనే మార్చుకుని కుంచెడు బియ్యం తీసుకుని వెళుతున్నట్టుగా భావించాను. ఇదీ



మాకు పౌరోహిత్యంలో తాతల కాలంనుంచి అచ్చివచ్చిందే!" అన్నాడు పురోహితుడు.

సంగతి అర్థమై దుకాణం దగ్గరవున్న వాళ్ళందరూ పెద్దగా నవ్వారు. సెట్టి సిగ్గుతో తలవంచుకున్నాడు. పురోహితుడికి ఇంత తెలివైనసలహాఇచ్చింది, గోవిందరాజని వారం తిరక్కుండానే గ్రామంలో అందరికీ తెలిసిపోయింది. జనం అతణ్ణి తెలివైనవాడూ, మంచి లౌక్యుడూ అని మెచ్చుకోసాగారు.

అయితే, గోవిందరాజు మాత్రం వాళ్ళతో, "మనం తెలిగ్గా మోసపోయే విషయాలలోని మెలికను కనిపెట్టి, ఆ మెలికను మనను మోసగించినవాళ్ళకు బిగుసుకునేలాగా సలహా ఇవ్వడం లౌక్యమూ కాదు, తెలివితేటలూ కాదు. నేను పురోహితుడుసుబ్రహ్మణ్యం విషయంలో ప్రయోగించింది చిట్కా మాత్రమే!



అయినా, చిట్కాలు అన్నివేళలా ఫలించవు," అనేవాడు.

ఏమైనా, ఆ తర్వాత ఒకటి, రెండు విషయాల్లో గోవిందరాజుసలహా బాగా పనిచెయ్యడంతో, గ్రామంలో తమకేదైనా సమస్య వస్తే చాలు, "గోవిందరాజేమైనా చిట్కా ప్రయోగిస్తాడేమో కనుక్కుందాం," అంటూ అతడి దగ్గరకు వచ్చేవారు.

ఒకసారి అక్కాయమ్మ అనే విధవరాలు, ఇద్దరాడపిల్లలతో గోపాలపురం వచ్చింది. ఆమె భర్త కాలంచేశాక, అన్నగారు ఆమెను తన ఇంట వుంచుకున్నా, వదినగారు మాత్రం సూటీపోటీ మాటలతో, "తేరగా ఇంట చేరి తింటున్నారు – దిక్కుమాలిన సంత!" అంటూ విసుక్కునేది. ఈ మాటలు భరించలేక అక్కాయమ్మ గోపాలపురం వచ్చి, ఇల్లు అద్దెకు తీసుకుని పూటకూళ్ళు పెట్టడం ప్రారంభించింది. గోపాలపురం చుట్టుపక్కల గ్రామాల సంతలకు కూడలి కావడంతోనూ, ఆమె పెట్టే భోజనం, ఫలహారాలు రుచిగానూ, శుచిగానూ వుండడంతో జనంబాగారాసాగారు.

అదే గ్రామంలో, కిట్టప్ప అనేవాడు ఎంతో కాలంగా పూటకూళ్ళఇల్లు నడుపుతున్నాడు. అక్కాయమ్మ కారణంగా వాడి వ్యాపారం దెబ్బతినసాగింది. వాడు ఇద్దరు కిరాయి మనుషులను పురమాయించి, అక్కాయమ్మ పూటకూళ్ళ ఇంటికి భోజనానికి పంపాడు.

వాళ్ళు భోజనంచేస్తూ, వెంటతెచ్చిన బొద్దింకలను పులుసుకూరలో వేసి, బయటికితీసి, "ఏం కలికాలం! అన్నంఅమ్ముకోవడమేపాపం. పైగా అందులో బొద్దింకలు. ఇలాంటి భోజనం పెట్టినవాళ్ళు రౌరవాది నరకాలు అనుభవిస్తారు!" అని కేకలు పెడుతూ విస్తరి ముందు నుంచి లేచిపోయారు.

దీనితో ఆసమయంలో భోజనాలు చేస్తున్న వాళ్ళల్లో కలకలం బయలుదేరింది. వాళ్ళు వంటకాలు తయారుచేసేప్పుడు అజాగ్రత్తగా వున్నదంటూ, అక్కాయమ్మను గట్టిగా చీవాట్లు పెట్టారు.

కిట్టప్ప ఆ రోజుతో ఊరుకోక, అవకాశం దొరికినప్పుడల్లా కిరాయి మనుషులను పంపి, అక్కాయమ్మ పూటకూళ్ళఇంటిని అల్లరిపాలు చేయసాగాడు. ఒకరోజు అన్నంలో మేకులు వచ్చేవి. మరొకరోజు శాకాహారంలో ఉడికిన మాంసంముక్కో,చేపముక్కో వచ్చేది. దానితో పూటకూళ్ళకు వచ్చేవాళ్ళు తగ్గిపోసాగారు.

ఇదంతా తనంటే ద్వేషం వున్నవాళ్ళుచేయిస్తున్నారని, అక్కాయమ్మ గ్రహించింది. ఆమె

ఒకరోజు గోవిందరాజు దగ్గరకువెళ్ళి, జరుగుతున్నది చెప్పి, ఏదైనా మంచి సలహా ఇవ్వమంటూ బావురుమన్నది.

గోవిందరాజు ఆమెతో, "యాచకుడికి యాచకుడే శత్రువు. అలాగే వ్యాపారికి వ్యాపారే శత్రువు. తన పూటకూళ్ళ వ్యాపారం దెబ్బతింటున్నదని,కిట్టప్ప ఈ అల్లరిపనులు చేయిస్తూండాలి. నువ్వొక పనిచెయ్యి. గుండప్పతో మాట్లాడు. వాడికి నా అనేవాళ్ళులేరు. పదిమందిని తన్నగల సత్తా, సాహసం ఉంది. వాడు కూలిపని చేసుకుని నిజాయితీగా పొట్టపోసుకుంటున్నాడు. వాడికి నువ్వు డబ్బులు పుచ్చుకోకుండా భోజనం పెట్టు. వాడు నీకు రక్షాకవచమవుతాడు!" అన్నాడు.

అక్కాయమ్మ, గుండప్పకు కబురు చేసి, వాడితో, "మగదిక్కు లేకపోవడంతో, నేను అందరికీ అలుసయ్యాను. ఎవరో నా పూటకూళ్ళ ఇంటికి చెడ్డపేరు తేవాలని, భోజన పదార్థాల్లో అవీ ఇవీ కలుపుతున్నారు. నువ్వు నాకు అండగా నిలబడు. నేను నీకుఉచితంగా భోజనం పెట్టి తృణమో, పణమో ఇచ్చుకుంటాను," అన్నది.

ముందు గుండప్ప, అక్కాయమ్మ తనను కిరాయి గూండాగా భావించిందని మండిపడ్డాడు.తర్వాత గోవిందరాజు సలహా ఇచ్చాడని విని, శాంతంగా ఆలోచించి, ఇందులో తనకేదో మేలున్నదని, సరేనన్నాడు.

ఆ తర్వాత వారం తిరక్కుండానే గుండప్ప, అక్కాయమ్మ ఇంట చేరాడు.వాడక్కడ ఉచితంగా భోజనం చేస్తూ, వంటపనుల్లో అక్కాయమ్మకు సాయపడసాగాడు. యుక్తవయస్కురాలైన అక్కాయమ్మ పెద్ద కూతురు కరుణ



వాడికి బాగా నచ్చింది. ఆ అమ్మాయి కూడా రోజులు గడిచేకొద్దీ వాడిపట్ల ఎంతో ఆదర భావం చూపసాగింది.

"నా అనేవాళ్ళు లేని తను అక్కాయమ్మకు అండగా నిలబడితే, ఏదో ఒకనాడు అల్లుడుగా స్థిరపడిపోవచ్చు. బహుశా, గోవిందరాజు చిట్కాలోని రహస్యం ఇదేనేమో!" అనుకోసాగాడు గుండప్ప.

కొద్దిరోజులు జరిగాక, ఒకరోజు కిట్టప్ప మళ్ళీ ఇద్దరు కిరాయిమనుషులను అక్కాయమ్మ పూటకూళ్ళ ఇంటికి పంపాడు. వాళ్ళు భోజనంచేస్తూ, వెంటతెచ్చిన బలపం ముక్కలను కూరలో వేసి, బయటికి తీస్తూ ఏదో అనబోయేంతలో, గుండప్ప వాళ్ళ మెడలు పట్టుకుని లేవనెత్తి, రెండుదెబ్బలు వేసి,"ఈ అల్లరిపని చేసేందుకు మిమ్మల్ని

పంపిన వాళ్ళెవరు? నిజం చెప్పండి! లేక పోతే చర్మం వలిచేస్తాను," అని గట్టిగా గదమాయించేసరికి, భోజనాలు చేస్తున్న అందరి ఎదటా, వాళ్ళు తమను కిట్టప్ప పంపాడని చెప్పేశారు.

అప్పటికప్పుడు నలుగురు పెద్దమను షులుపోయి, కిట్టప్పను గోవిందరాజు దగ్గరకు లాక్కుపోయారు. గోవిందరాజు ప్రశ్నించక ముందే కిట్టప్ప కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ, "గోవిందరాజూ! గుండప్పను, అక్కాయమ్మ పూటకూళ్ళ ఇంట్లో ప్రవేశ పెట్టిన చిట్కా నీదని, ఇప్పటికి గ్రహించాను. నా పూట కూళ్ళవ్యాపారం దెబ్బతినిపోతున్నదన్న కసి కొద్దీ, నేనే కిరాయివాళ్ళను, అమె ఇంటికి పంపాను. నువ్వేశిక్ష విధించినా భరిస్తాను," అన్నాడు.

"కిట్టప్పా! శిక్ష విధించేందుకు నేను గ్రామాధికారిని కాదు. ఒకటి గుర్తుంచుకో- ఇతరులకు హాని చేసేవాడిని దేవుడు మెచ్చడు. ఇతరుల మేలు కోరేవాడికి శుభం కలుగు తుంది. ఈ జరిగిన దాన్ని చూసి నిన్ను గ్రామస్థులంతా పరమదుష్టుడికింద జమ కట్టేస్తారు. నీకున్న ఇతరత్రా చిన్న వ్యాపారాలు కూడా దెబ్బతిని పోగలవు. నీకు తిరిగి గ్రామంలో అంతో ఇంతో మంచిపేరు రావా లంటే, ఒక పనిచెయ్యి. అక్కాయమ్మ రెండో కూతుర్ని నీ కొడుక్కు చేసుకో బోతున్నానని నలుగురికీ చెప్పు. దుండగుల బారినుంచి పూటకూళ్ళ వ్యాపారాన్ని ఎలా కాపాడుకోవాలో అక్కాయమ్మకు తెలియ చెప్పేందుకు మాత్రమే - అలా కిరాయి మనుష్యులను పంపానని నమ్మబలుకు. ఆతరవాత అంతా చక్కబడుతుంది," అని సలహా ఇచ్చాడు గోవిందరాజు.

కిట్టప్ప, గోవిందరాజు ఇచ్చిన సలహాప్రకా రమే చేశాడు. గోవిందరాజు చిట్కా పుణ్యమా అంటూ - ఏ శ్రమా లేకుండా అక్కాయమ్మ కూతుళ్ళిద్దరికీ పెళ్ళిళ్ళయ్యాయి. గుండప్ప అక్కాయమ్మపెద్దకూతుర్ని పెళ్ళాడి, అమె సహాయంతో ఎటువంటి ఇబ్బందీ లేకుండా పూటకూళ్ళు నడుపుతూ, అత్తగారికి పూర్తి విశ్రాంతి కలిగించాడు.

కిట్టప్పకు కోడలితో పాటు, పోయిన గౌరవం నిలబడింది. ఇలా కథ సుఖాంత మవడంతో, గోవిందరాజుచిట్కా మరొకసారి గ్రామమంతా ప్రచారమైంది.





# చెల్లని సరుకు

బలుసులపాలెం కరణంపేరు, బుల్లెయ్య. ఒకనాడు ఆయన వీధిచావడిలో కూర్చుని, కర్ణీకపులెక్కలు ఏవో సరిచూసుకుంటూండగా, ఆయనభార్య లలితాంబ వచ్చి, "అమ్మాయికి సీమంతంచేయడానికి సాయంత్రంపొన్నపల్లిలోని మన వియ్యంకుడిగారింటికి వెళ్ళాలి. పేరంటం సందర్భంగా పంచడానికి మిఠాయిలు కావాలని ఉదయం చెప్పాను. ఆ విషయం గుర్తుందా?" అని అడిగింది.

"గుర్తులేకేం! ఇప్పుడే ఆ పని చూస్తాను." అని భార్యను లోపలికి పంపి, వీధినపోయే వారిమీద ఒకకన్ను, తనలెక్కల మీద ఒకకన్ను వేసికూర్చున్నాడు బుల్లెయ్య.

ఇంతలో ఆ దార్నిగా వచ్చాడు సాంబయ్య అనే చిన్నరైతు. బుల్లెయ్య అతణ్ణి పిలిచి, తగ్గుస్వరంలో ఏదోమాట్లాడి పంపాడు. మరి కాసేపటికి అటుగావచ్చిన పేరయ్యనుపిలిచి, అతడితోనూఏదోమాట్లాడిపంపాడు బుల్లెయ్య.

"ఏదో వ్యవహారంలో పడి మిఠాయిల సంగతి మరిచినట్టున్నారే!" అంటూ మళ్ళీ వచ్చింది లలితాంబ.

"లేదు, లేదు. ఆ పనిలోనే ఉన్నాను!" అంటూ బదులిచ్చిన భర్తను అనుమానంగా చూస్తూ, తిరిగిలోపలికి వెళ్ళింది లలితాంబ.

ఆ తర్వాత కొద్దిసేపటికి దారివెంట పోతున్న మరిద్దరిని పిలిచి, ఏదో మాట్లాడి పంపాడు, బుల్లెయ్య.

ఇంటిలోనే వుండి, ఒకకన్ను ఇటువేసి వుంచిన లలితాంబ తిరిగి బయటికి వచ్చి, "దారేపోయేవాళ్ళనుపిలిచి అదీయిదీమాట్లాడుతున్నారు గానీ, మిఠాయిలు తెప్పించమన్న నామాట మాత్రం చెవికెక్కించుకున్నట్టు లేదు!" అన్నది నిష్ఠూరంగా.

"చూస్తున్నావుగా? ఇప్పుడు నేనుమాట్లాడిన వాళ్ళందరూ, మిఠాయిలు కొని తెచ్చేపనిమీద వెళ్ళిన వాళ్ళే!" అన్నాడు బుల్లెయ్య నవ్వుతూ.

వారణాశి రామక్రిష్ణ

"నేనంత వెర్రిదాన్ని కాదులెండి! మిఠాయిలు తేవడానికయితే మీరింత మందిని ఎందుకు పంపుతారు? ఒక్కరు చాలరా? అందువల్ల, నా ఎదురుగా ఒక మనిషిని పిలిచి, మిఠాయిలు తెమ్మని అతడికి మీరు పురమా యించేదాకా, నేను ఇక్కడనుంచి కదిలేదిలేదు," అన్నది లలితాంబ గట్టిగా.

"మిఠాయిలు కొనాలని మనమనుకున్నా, అమ్మడానికి ఆ గురువయ్యశెట్టి ఇంకా సిద్ధంగా లేడు," అన్నాడు బుల్లెయ్య నవ్వుతూ.

"ఇది మరీ చోద్యంగా వుంది! అతగాడు అమ్మేది ఏ ఇల్లో, పొలమో కాదుగదా. దుకాణం తెరిచేదే అమ్మడానికాయె. మరి ఇంకా సిద్ధం కాకపోవడంఏమిటి? అసలువిషయంఏమిటో చెప్పరాదా?" అన్నది లలితాంబ కోపంగా.

"బావుంది, అలా అడుగు చెబుతాను.నేను నిన్ననే గురవయ్యశెట్టి దుకాణానికి వెళ్ళి మిఠాయిల ధరలు విచారించాను. లడ్లు గాని, మైసూరుపాకులుగాని, మణుగు ఇరవై రూపాయిలకు తగ్గేది లేదన్నాడు. సరుకు నాణ్యంగా, రుచిగావుంది. అతడు ధరతగ్గించేందుకు ఒక ఉపాయం ఆలోచించాను.దాని ప్రకారం – ఇప్పుడు నేను పంపిన వాళ్ళంతా శెట్టి దుకాణానికి వెళ్ళి ధరలు విచారించి సరుకు రుచిచూస్తారు. తర్వాత, 'ఈ మిఠాయికి వాడిన పిండి కల్తీదిలావుంది అనీ, సరుకు నిలవవున్నట్టుంది అనీ, వాడిన నెయ్యిలోఏదో లోపం వున్నదనీ' ఇలా రకరకాలుగా వంకలు పెట్టి కొనకుండా వెళ్ళిపోతారు. నలుగురూ ఒకేరకంగా అనేసరికి, గురవయ్యశెట్టికి తన మిఠాయిల్లో నిజంగానే ఏదోలోపం వున్నదని గట్టినమ్మకం కలుగుతుంది. ఆ సరుకును వదిలించుకోవడానికి ధరను సగానికి సగం తగ్గిస్తాడు. గురవయ్య అలా ధరలు తగ్గించి సరుకు అమ్మడానికి సిద్ధపడగానే వాటిని కొని తెమ్మని నేను పంపిన వాళ్ళకు చెప్పాను!" అంటూ బదులిచ్చాడు బుల్లెయ్య.

ఇంతలో చిట్టెయ్య, పెద్ద సంచీనిండుగా మిఠాయిలు నింపుకుని వస్తూనే, "అయ్యా, మీరన్నట్టుగానే గురవయ్యశెట్టి ధరలుసగానికి సగంతగ్గించాడు.ఈ రోజున మణుగుమిఠాయి ధర పదిరూపాయలే!" అన్నాడు పొంగిపోతూ.

తన భర్త కూర్చున్నచోటు నుంచి కదలకుండా, ఇంత తంత్రం నడిపినందుకు, అతడి కేసి అబ్బురంగా చూస్తూ, అలాగే నిలబడి పోయింది లలితాంబ.





# సామ్రాట్ అశోక

## 2

[మగధ రాజధాని పాటలీపుత్రంలో చాణక్యుడి సాయంతో చంద్రగుప్తుడు రాజై, మౌర్య వంశాన్ని స్థాపించాడు. చంద్రగుప్తుడి అనంతరం ఆయన కుమారుడు బిందుసారుడు రాజయ్యాడు. ఒకనాడు ఒక పేదబ్రాహ్మడు, తన కుమార్తె సుభద్రను వెంటబెట్టుకునివచ్చి,ఆమె మహారాణి అవుతుందని జ్యోతిష్కులు చెప్పారని రాజుకు అప్పగించి, వివాహమాడమన్నాడు. రాజు అప్పటికి సరే అన్నాడు గాని, రాజ్యవ్యవహారాలలో పడి ఆ విషయం మరిచిపోయాడు. రెండేళ్ళ తరవాత ఆయనకావిషయం జ్ఞాపకం రాగానే, సూర్యాస్తమయంలోగా సుభద్రను వివాహమాడాలని నిర్ణయించాడు. తరవాత–]

రాజాజ్ఞ కాగానే, సుభద్రను వివాహమాడే విషయం భటులు చాటింపు ద్వారా ప్రజలకు తెలియజేశారు. నగర వీధులనుఅరటిచెట్లతో, మావితోరణాలతో, రంగురంగుల పువ్వులతో అలంకరించారు.నగరం వింత శోభతో కళకళ లాడసాగింది.

అదృష్టవశాత్తు సుభద్ర తండ్రి అయిన బ్రాహ్మడు, తనకుమార్తె రాజభవనంలో ఎలా వుందో చూసిపోదామని ఆరోజే రాజధానికి వచ్చాడు.తన కుమార్తె వివాహం అప్పుడే జరగనున్నదని గ్రహించి పరమానందం చెందాడు.ఆయన రాజభవనం సమీపి స్తూండగా, ఆయనను ఆహ్వానించడానికి రాజభటులు గ్రామానికి ప్రయాణమవుతూ న్నట్టు తెలియవచ్చింది. ఆయన్ను చూడగానే, భటులుఆదరంగా రాజభవనంలోకి తీసుకు వెళ్ళారు. మరికొంత సేపటికి మేళతాళాలతో, వేదమంత్రాలతో, ఆస్థానజ్యోతిష్కులు నిర్ణ



యించిన శుభఘడియలలో రాజు బిందు సారుడు, మాట ఇచ్చిన ప్రకారం సూర్యాస్త మయంలోగా సుభద్రను వివాహమాడాడు. సుభద్రతండ్రి, నూతన దంపతులను ఆనంద బాష్పాలతో ఆశీర్వదించాడు.

రెండేళ్ళపాటు రాజభవనంలో మామూలు పరిచారిక లాగా జీవితం గడిపిన సుభద్ర, ఇప్పుడు సర్వాలంకారభూషిత అయిన రాణి అయింది. అవసరాలు సమకూర్చడానికి పలువురు పరిచారికలతో ఆమెకు ప్రత్యేకంగా ఒక భవనం ఏర్పాటయింది.

ఇన్ని సంపదలు సమకూరిన తరవాత ఆమె సంతోషానికి తక్కువేముంటుంది? కాని, ఆమెకు సంతోషంగా ఉండే భాగ్యం కలగలేదు. రాజుగారి పెద్దరాణులు సమయం దొరికితేచాలు; ఆమెను సూటిపోటి మాటలతో వేధించసాగారు: "అదిగో చూడు, ఆ బిక్షగాడి కూతురు ఎంత అహంకారంతో మిడిసిపడు తున్నదో!" అని ఒక రాణి అంటే, "బ్రాహ్మణ కన్యలు ఇలా సిగ్గువిడిచి రాజభవనాలమీద పడితే మనం రాజకుమార్తెలుగా పుట్టడమెం దుకు?" అని మరొక రాణి వంతపాడేది.

"ఈ నడమంత్రపుసిరి, మరి ఎంతకాలం ఉంటుందో అదీ చూడకపోతామా?" అని మూడోరాణి అంటే, మిగతా ఇద్దరూ పకపకా నవ్వేవారు హేళనగా.

సూదుల్లాంటి వారి మాటలకు సుభద్ర హృదయం విలవిలలాడేది. అయితే, ఆమె మౌనంగా రోదించేదే తప్ప, ఆ సంగతి తన భర్తఅయిన రాజుతో కూడా చెప్పేది కాదు. ఆమెస్వభావం అటువంటిది. పైగా రాజురాజ్య వ్యవహారాలలో తలమునకలుగా ఉన్నాడు. రాజభవనంలో జరిగే వ్యవహారాలను పట్టించుకునే స్థితిలో లేడు.

సుభద్ర అంటే తొలినుంచి అనురాగం చూపే ఒక వృద్ధపరిచారిక, ఒంటరిగా విల పించే సుభద్రను, "నువ్వంటే వాళ్ళకు ఎంతో అసూయ తల్లీ! అందుకే నిన్నిలా వేధిస్తు న్నారు. వాటన్నిటినీ పట్టించుకోవద్దు. ఈ భవనంలో వాళ్ళకున్న అధికారం, నీకూ ఉన్నది!" అని ఓదార్చేది.

ఆ మాటలకు సుభద్ర చిన్నగా నవ్వేది. అయితే, ఆనవ్వులో సంతోషంకన్నా, విషాదం పాలు ఎక్కువగా కనిపించేది.

ఇలా ఒక యేడాది గడిచింది. సుభద్ర ఒక మగబిడ్డను ప్రసవించింది. కాంతులు వెదజల్లే ఆ బిడ్డమోము చూస్తూ, "నీ రాకతో నాశోకంతీరిపోయింది నాన్నా! నా శోకంతీర్చ



డానికి పుట్టిన అశోకుడివి నువ్వు!" అంటూ రెండు చేతులతో ఎత్తుకుని ముద్దాడేది. ఆ బిడ్డకు అశోకుడనే పేరు స్థిరపడి పోయింది.

అశోకుడు జన్మించడానికి ముందే పెద్ద రాణులు ముగ్గురు, ఐదుగురు కొడుకులను కన్నారు. వారిలో సుశేముడనే వాడు పెద్దవాడు. అందరూ అతన్ని చిన్నప్పటి నుంచే యువ రాజుగా భావించసాగారు. కాబట్టి రాజోద్యోగులు అతనిపట్ల అమితమైన గౌరవమర్యాదలు ప్రదర్శించ సాగారు. దాంతో అతనిలో అహంకారం పెరగసాగింది. తన ఇష్టానికి భిన్నంగా నడుచుకునే వారిమీద దురుసుగా ప్రవర్తించే వాడు. తన మాటకు మారుపలికే వారిమీద విరుచుకుపడేవాడు. తను చెప్పినట్టు చేయకపోతే సేవకులను కొట్టేవాడు. అయినా, కాబోయే రాజు అన్నభయంతో అతనికి ఎవరూ ఎదురుచెప్పేవారు కాదు. సుశేముడు అశోకుడికన్నా మూడేళ్ళు పెద్ద. వాళ్ళిప్పుడు నవయౌవన ప్రాయంలోఉన్నారు. వాళ్ళిద్దరూ ఒకనాడురాజోద్యానంలో విహరిస్తూండగా, అటువైపు వచ్చిన తోటమాలి అశోకుడికి నమస్కరించాడు. చాటునుంచి హఠాత్తుగా ఒక దెబ్బతో తోట మాలిని కింద పడద్రోసి,"నన్నే అవమానిస్తావా?" అని అరిచాడు సుశేముడు.

తోటమాలి మెల్లగా లేచి నిలబడి, "తమర్ని నేనెందుకు అవమానిస్తాను ప్రభూ!" అన్నాడు.

"అయితే. నన్ను వదిలి, నా ఎదుట ఈ బిచ్చగత్తె కొడుక్కు ఎందుకు నమస్కరించావు?" అని గద్దించాడు సుశేముడు.

"అన్నయ్యా, మాటలు మర్యాదగా రానీ. మీతల్లి నాకుతల్లి అయినట్టే, నా తల్లి కూడా నీకుమాతృసమానురాలే!"అన్నాడు అశోకుడు.

"ఛీ, నోర్ముయ్! మరోసారి ఆ మాట అనకు. నీ తల్లి నాకు తల్లీ కాదు; నా తల్లి నిన్ను తన కొడుకుగా భావించడం, ఈజన్మలో జరగదు!"అన్నాడు సుశేముడు వెటకారంగా.

"మనమిద్దరం బిందుసార మహారాజు కుమారులం. మీ తల్లిలాగే నా తల్లి కూడా రాజుగారినివివాహమాడిన ధర్మపత్ని! నాతల్లిని అవమానిస్తే అది మన తండ్రిని అవమానించినట్టే అవుతుంది!" అన్నాడు అశోకుడు నెమ్మదిగా.

"నిన్నూ, నీతల్లినీ అవమానించడం నాకు ఆనందకరమైన విషయం! నువ్వేం చేయగలవు?"అన్నాడుసుశేముడు పట్టరానిగర్వంతో.

"అందుకు నీనుంచి క్షమాపణలు చెప్పించడమే నాకు ఆనందకరం!" అంటూ అశో

కుడు సుశేముడి చేయి వడిసిపట్టుకుని వెనక్కు మెలితిప్పాడు.

సుశేముడు వదలమని బాధతో అరిచాడు. కాని అశోకుడు వదలేదు. తోటమాలి ఉద్యాన వనంనుంచి వెలుపలికివచ్చి, అటుగా వెళు తూన్న మంత్రికి విషయం చెప్పాడు.

మంత్రి అక్కడికివచ్చి, "ఆయన్ను వదిలి పెట్టు, వదిలిపెట్టు," అని అరిచాడు.

అశోకుడు సుశేముడి చేయివదలి మంత్రి కేసి చూశాడు.

"అన్నను అలా చేయవచ్చా?" అని అడి గాడు మంత్రి.

"అతడు అన్నలాగా నడుచుకోలేదు. అవి వేకి అయిన శత్రువులా మాట్లాడాడు. నా తల్లినీ, తండ్రినీ అవమానించడం నేను సహించను. ఇకపై వారిని గురించి మాట్లాడితే అతని చేయిని కాదు; మెడను విరుస్తాను," అన్నాడు అశోకుడు కోపంగా.

సుశేముడు అశోకుడి కేసి ఒకసారి ఆగ్ర హంతో చూసి, అక్కడి నుంచి వేగంగా వెళ్ళి పోయాడు. మంత్రికి అతని ధోరణి చూస్తూంటే ఏదో ఒకనాడు అశోకుడి మీద పగసాధించే వాడిలాగే కనిపించాడు!

చంద్రగుప్తుడు నందులను ఓడించి, మౌర్యవంశం స్థాపించడానికి సాయపడిన చాణక్యుడు, బిందుసారుడికి కూడా ప్రధాన సలహాదారుగా కొనసాగుతున్నాడు. రాజ కుమారులు ఇరువురి మధ్య రగులుతూన్న పగను గురించి మంత్రి ఒకనాడు చాణక్యుడికి తెలియజేశాడు.

"చుట్టూ చేరిన వంధిమాగధుల పొగడ్తల కారణంగా సుశేముడు దారి తప్పుతున్నాడు. అశోకుడు ఇంకా పసిప్రాయంలోనే ఉన్నాడు. మునుముందు మంచివాడుగా రూపొంద వచ్చు. లేదా, వాడూ దారి తప్పవచ్చు. అంతా పరిస్థితుల ప్రభావం మీద ఆధారపడి





ఉంటుంది!" అన్నాడు చాణక్యుడు, గంభీరంగా.

"నిజమే, మహాత్మా! అయినా మహారాజుగారు సుశేముడి పట్ల పక్షపాత వైఖరితో ప్రవర్తిస్తున్నారని నా అనుమానం. అహంభావి అయిన సుశేముడు రాజైతే మౌర్యసామ్రాజ్యానికి క్షేమంకాదని నా అంతరాత్మ చెబుతున్నది!" అన్నాడు మంత్రి.

చాణక్యుడుకొంతసేపు మౌనంగా ఆలోచించి,"రాజుగారికి జ్యేష్ఠకుమారుడి పట్లగల భ్రమలనుతొలగించడం అవసరం!"అన్నాడు.

మంత్రి చాణక్యుడికి నమస్కరించి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

ఒకనాడు సాయంకాలం భవన ఉపరితలంలో పచార్లుచేస్తూన్నరాజుదగ్గరికి చాణక్యుడు వచ్చాడు. బిందుసారుడు అయనకు చేతులెత్తి నమస్కరించి,"వార్త పంపితే తమ సమక్షానికి నేనే వచ్చేవాణ్ణి కదా!" అన్నాడు.

"మీ కుమారులలో ఒకరిని మౌర్యసింహాసనానికి అర్హుడయిన వారసుడిగా తీర్చిదిద్దవలసిన సమయం ఆసన్నమయింది. ఆవిషయం తమకు గుర్తుచేయడం నా ధర్మంగా భావించి వచ్చాను," అన్నాడు చాణక్యుడు.

రాజు ఉలిక్కిపడి, "నా జ్యేష్ఠకుమారుడు యువరాజు సుశేముడు మౌర్యరాజ్యసింహాసనం అధిష్ఠించడానికి అర్హుడుకాడా?"అని అడిగాడు ఆశ్చర్యంగా.

"జ్యేష్ఠకుమారుడు సింహాసనానికి వారసుడు కావడం సాధారణ సంప్రదాయం మాత్రమే. అది అన్ని సందర్భాలకూ అభిలషణీయంకాదు. దక్షతగలవారికే రాజ్యపట్టాభిషేకంజరగాలి!అదేరాజ్యానికిక్షేమం!" అన్నాడు చాణక్యుడు.

చాణక్యుడు మితభాషి అనీ, ఏదిచెప్పినా బాగా ఆలోచించిగాని చెప్పడనీ రాజు బిందుసారుడికి తెలుసు.పెద్దకొడుకును రాజు చేసే విషయంలో తనను పునరాలోచించమని కోరడానికి బలమైన కారణం ఉండి తీరుతుందని ఆయన గ్రహించాడు.

"రాజా, ఈ విషయంలో మనం తొందరపడనవసరం లేదు. రాజ్యసింహాసనం ఎవరికి అప్పగించాలో ఇంకా నిర్ణయం తీసుకోలేదనీ, రాజకుమారుల ప్రవర్తనను మనం గమనిస్తున్నామనీ రాజకుమారులకు తెలియాలి.రెండుమూడేళ్ళు పెద్దవాడై పుట్టినంతమాత్రాన ఈనేరాజ్యానికిరాజు కాగలననే భావం సుశేముడికి కలగకూడదు. అదేవిధంగా మనం అప్పుడప్పుడు రాజకుమారుల తెలివితేట

లను పరీక్షించడం అవసరం!" అన్నాడు చాణక్యుడు.

"చిత్తం, మహాత్మా! అంతా తమ అభీష్టానుసారమే కానివ్వండి. ఆ పరీక్షలేవో వెంటనే ప్రారంభించినా అక్షేపణ లేదు," అన్నాడు బిందుసారుడు.

"ఆ విషయం గురించి కూడా ఆలోచించాను. రేపు సూర్యోదయంకల్లా మీ కుమారులు ఆరుగురినీ నగరానికి ఉత్తరంగాఉన్న శివాలయానికి రమ్మనండి. వాళ్ళు వచ్చేప్పుడు వాళ్ళకు నచ్చిన ఉత్తమ వాహనంలో రావాలి; వచ్చేముందు బలవర్ధకమైన ఆహారం భుజించి రావాలి; ఆలయం చేరిన తరవాత విలువైన ఆసనంలో కూర్చోవాలి – అని విడివిడిగా సందేశాలు పంపండి!" అని చెప్పి, చాణక్యుడు అక్కడి నుంచి బయలుదేరాడు.

చాణక్యుడు చెప్పినట్టే రాజు తన కుమారులకు సందేశాలు పంపాడు.

మరునాడు సూర్యోదయానికిముందే రాజు బిందుసారుడు, చాణక్యుడు, మంత్రులు, కొందరు రాజోద్యోగులు శివాలయ ప్రాంగణానికి చేరారు. సూర్యోదయం కాగానే రాజకుమారులు ఒక్కొక్కరుగా రాసాగారు.

యువరాజు సుశేముడు జోడుగుర్రాలు పూన్చిన, అందమైన రథంలో వచ్చి దిగాడు. రెండవ రాకుమారుడు ఆభరణాలతో అలంకరించిన ఏనుగు మీద వచ్చాడు. మూడవ రాకుమారుడు దృఢమైన గుర్రం మీద వచ్చాడు.

నాలుగవ రాకుమారుడూ, ఐదవ రాకుమారుడూ పల్లకీలలో వచ్చి దిగారు. ఆఖరుగా



వచ్చిన అశోకుడు మాత్రం ఏ వాహనంలోనూ రాకుండా, కాలినడకనే సమయానికి అక్కడికి వచ్చిచేరాడు.

ఆలయమంటపంలో, రాజభటులు రాకుమారులు వేయమన్న ఆసనాలు వేశారు. ఇద్దరు రాకుమారులు తమవెంట తెప్పించుకున్న దంతపుసింహాసనాల మీద ఆసీనులయ్యారు. మరిద్దరు పట్టుపరుపులు పరచి, వాటి మీద సుఖంగా కూర్చున్నారు. ఐదవ రాకుమారుడు పులిచర్మం పరచి దానిమీద కూర్చున్నాడు. అశోకుడు తన వెంట ఏమీ తెచ్చుకోలేదు. శుభ్రంగా నేల మీద కూర్చున్నాడు.

అశోకుడి ప్రవర్తనకు మిగిలిన రాకుమారులు తమలో తాము హేళనగా నవ్వుకోసాగారు.

రాజుకు కూడా అశోకుడి ప్రవర్తన విడ్డూరంగా తోచింది.

చాణక్యుడు రాకుమారులను సమీపించి, "మీ వాహనాలను, ఆసనాలను చూశాం.మరి ఉదయం ఏం భుజించారు?" అని అడిగాడు.

రాకుమారులు తాము తిన్న, రకరకాల వంటకాలను గురించి పోటీపడి వివరించారు.

ఆ తరవాత చాణక్యుడు అశోకుణ్ణి సమీపించి, "నాయనా! నువ్వు రాజకుమారుడివి. నీ దగ్గర ఎన్నో వాహనాలు ఉన్నాయి.వాటిని వద్దని కాలినడకన ఎందుకు వచ్చావు?"అని అడిగాడు.

"మహాత్మా! తమరు ఉత్తమమైన వాహనాన్నే ఉపయోగించమన్నారు. నేను నాకు ఉత్తమమనితోచిన నా కాళ్ళను ఉపయోగించాను. మనిషికి కాళ్ళకు మించిన ఉత్తమ వాహనం లేదనుకుంటాను," అన్నాడు అశోకుడు.

"అలాగా! మరి ఏ ఆహారం భుజించి వచ్చావు?" అని అడిగాడు చాణక్యుడు.

"గిన్నెడు పెరుగు!" అన్నాడు అశోకుడు.

"నిన్ను బలవర్ధకమైన ఆహారం కదా భుజించి రమ్మన్నాను. మరి గిన్నెడుపెరుగు తాగి వచ్చానంటావేమిటి?" అన్నాడు చాణక్యుడు ఆశ్చర్యంగా.

"బిడ్డకు ఏ వేళకు ఏది బలవర్ధకమైన ఆహారమో తల్లికే తెలుసు. నా తల్లి నాకు ఉదయం గిన్నెనిండాపెరుగు ఇచ్చింది.మారు మాట్లాడకుండా దానిని తాగి వచ్చాను," అన్నాడు అశోకుడు.

"ఇదేమిటి, ఇలా కటికనేలమీద కూర్చున్నావు? ఇదేనా విలువైన ఆసనం?" అని అడిగాడు చాణక్యుడు.

"మహాత్మా! విలువైన ఆసనం మీద తమరు కూర్చోమన్నారు. భూమికన్నా విలువైనది ప్రపంచంలో ఉన్నదా? అందుకే భూమిని ఆసనంగా చేసుకున్నాను?" అని సమాధానమిచ్చాడు అశోకుడు.

"అద్భుతమైన సమాధానం!" అన్నారు రాజుకు వెనకగా నిలబడిన మంత్రులూ, రాజోద్యోగులూ ముక్తకంఠంతో.

చాణక్యుడు మందహాసం చేస్తూ, "నిన్ను అభినందిస్తున్నాను!" అంటూ అశోకుణ్ణి ఆప్యాయంగా వీపుపై స్పృశించాడు.

కుమారుడి తెలివితేటలకు రాజుకు ఆశ్చర్యానందాలు కలిగాయి. – (ఇంకావుంది)





# ఇంద్రజాలం-గంధర్వమాయ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడుశవంలోని బేతాళుడు, "రాజా, మొక్కవోని నీ దీక్షాదక్షతలు నాకు ముచ్చట కలిగిస్తున్నా, అర్ధరాత్రివేళ నువ్విలాఒంటరిగా పడుతున్నశ్రమ చూస్తూంటే జాలి కలుగుతున్నది. ఒక దేశానికి రాజువైన నువ్వు, ఒక సేవకుడిలా ఎందుకిలా ఊడిగం చేస్తున్నావో అంతుబట్టకుండావుంది. బహుశా, ఏవైనా క్షుద్రశక్తులను వశంచేసుకుని, వాటి ద్వారా నీ తీరని కోరికలను తీర్చుకోవాలను కుంటున్నావేమో! అయితే, క్షుద్రశక్తులే కాదు, దేవతాశక్తులయినా సరే, అవి తీర్చే కోరికలు తాత్కాలికంగా మనిషికి ఆనందం కలిగించినా, కడకు మనశ్శాంతిని దూరంచేస్తాయని, నానమ్మకం. ఇందుకు నిదర్శనంగా, కురూపిగా జన్మించిన తాను, జగదేక సుంద

## బేతాళ కథలు



రిగా భాసించే అదృష్టం పట్టి కూడా చేజేతులా జారవిడుచుకున్న, ఒక మందమతి రాకుమార్తె కథచెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పగడపురాన్ని జీమూతవర్మ అనే రాజు పాలించేవాడు. ఆయన మంచి సుందరరూపి. పట్టపురాణి వసుధాదేవి కూడాఎంతో సౌందర్య వతి. అయితే, వారికి లేకలేక జన్మించిన రాకుమార్తె మాత్రం, కురూపి.

తమ కుమార్తె ఇలా అనాకారిగా జన్మించి నందుకు రాజదంపతులు ఎంతగానో కుమిలి పోయారు. అయినా, కాకిపిల్ల కాకికి ముద్దన్నట్టు, ఆమెకు మణిమంజరి అని నామకరణం చేసి, అల్లారుముద్దుగా పెంచసాగారు. అయితే, దేవుడు కరుణామయుడనేందుకు నిదర్శనంగా, ఆమెకు తీయని కంఠస్వరం ప్రసాదించాడు. పదిపన్నెండేళ్ళకే ఆమె గాత్ర సంగీతంలో నిష్ణాతురాలైంది. వీణ వాయించడంకూడా నేర్చుకుంది. ఆమె వీణ వాయిస్తూ గానం చేస్తూంటే, వింటున్న పామరులేకాదు, పండితులుకూడా తన్మయత్వంతో మరొక లోకంలో విహరించేవాళ్ళు.

చూస్తూండగానే మణిమంజరి యుక్తవయస్కురాలయింది. ఇప్పుడు రాజదంపతులకు తమకుమార్తె వివాహవిషయం ఒక సమస్యగా పరిణమించింది. కురూపి రాకుమార్తెను, ఏ రాకుమారుడు కోరిపెళ్ళిచేసుకుంటాడు? అని వాళ్ళు మనసులో మథనపడసాగారు.

ఇలావుండగా – ఒక పున్నమిరాత్రి మణిమంజరి ఒంటరిగా ఉద్యానవనంలోని అశోక వృక్షంకిందకూర్చుని,వీణ మీటుతూ శ్రావ్యంగా పాడసాగింది. ఆ సమయంలో ఆకాశయానం చేస్తూ అటుగావచ్చిన, వేదచందన అనేగంధర్వకన్య ఆ గానానికి పరవశించి, ఉద్యాన వనంలోదిగి,యువరాణిని సమీపించి,"ఆహా! ఏమి గాత్రమాధుర్యం! మా గంధర్వలోకంలో కూడా ఇంత శ్రావ్యంగా పాడగలవాళ్ళులేరు," అని అభినందించింది.

హఠాత్తుగా తన ఎదుటికి వచ్చిన గంధర్వకన్యను చూసి నివ్వెరపోయినయువరాణి,తన గానాన్ని ఆపి, అప్రయత్నంగా లేచి నిలబడి, బంగారపుబొమ్మలా మెరిసిపోతున్న ఆ గంధర్వకన్య కేసి రెప్పవాల్చకుండా చూడసాగింది.

తనను అబ్బురంగాచూస్తున్న,మణిమంజరి మనసులోని ఆలోచనను పసిగట్టిన వేదచందన, చిరునవ్వు నవ్వి, తన కుడిచేతివేలిన వున్న పగడపు ఉంగరాన్ని, మణిమంజరి వేలికి తొడిగి,"యువరాణీ! ఇది మహిమగల

ఉంగరం. ఇది ధరించినవాళ్ళు ఇతరులకు, నా రూపంలో జగన్మోహనంగా కనిపిస్తారు. కాబట్టి, నువ్వింక నీ కురూపితనం గురించి బాధపడనవసరంలేదు. అయితే ఒకటి; నీకు నువ్వు మాత్రం యథారూపంలోనే కనిపిస్తావు. మరొక సంగతి; ఈ ఉంగరంధరించి ఎన్నడూ గుళ్ళూ,గోపురాలకు వెళ్ళకూడదు. ఈ ఉంగరాన్ని ధరించి దైవసన్నిధిలో నిలబడితే,ఇక శాశ్వతంగా ఉంగరం తన మహిమను కోల్పోతుంది!" అని హెచ్చరించి, గంధర్వకన్య ఆకాశమార్గాన వెళ్ళిపోయింది.



ఈ జరిగింది కలా, నిజమా అని ఆశ్చర్యపోతూ మణిమంజరి చుట్టూ చూసేంతలో, రాజదంపతులు అక్కడికి వచ్చారు. వాళ్ళు అశోకవృక్షం కింద పసిడిబొమ్మలా మెరుస్తున్న యువతిని చూసి దిగ్భ్రమ చెందారు.

ముందుగా మహారాజు తేరుకుని, "ఎవరమ్మా నువ్వు? మా మణిమంజరి ఏదీ?"అని ప్రశ్నించాడు,పక్కనే వున్న వీణ తన కుమార్తెదే అని గ్రహించి.

మణిమంజరి కాసేపు మౌనంగా వుండి, "నాన్నా!" అంటూ తండ్రిని కౌగలించుకుంది.

రాజదంపతులు, తమ కుమార్తె కంఠస్వరాన్ని గుర్తుపట్టారు. అయితే, రూపం మాత్రం, ఏమాత్రం పోలిక లేకపోవడంతో అయోమయంగా ఆమెకేసి చూడసాగారు.

. అప్పుడు మణిమంజరి, గంధర్వకన్య గురించి తల్లిదండ్రులకు వివరంగా చెప్పింది. మహారాణి కుతూహలాన్ని అణచుకోలేక, తనకుమార్తె వేలికున్న మహిమగల ఉంగరాన్ని తాను ధరించింది. ఇప్పుడు మహారాణి – మహారాజుకు, యువరాణికి, గంధర్వకన్య రూపంలో అతిలోక సుందరిలా కనిపించింది. ఇద్దరూ చప్పట్లు చరుస్తూ పెద్దగా నవ్వారు. ఏదో ఒక కారణంగా, తమ కుమార్తె కురూపితనం సమస్య పరిష్కార మయిందని, రాజదంపతులు ఆనందంతో పొంగిపోయారు. మహారాణి తన వేలిన వున్న ఉంగరాన్నితీసి, కుమార్తె వేలికి తొడిగింది.

మర్నాడు, గంధర్వకన్య వేదచందన రూపంలో వున్న యువరాణిని చూసి, ఆమె చెలికత్తెలిద్దరు అమితాశ్చర్యం చెందారు. వాళ్ళు గుసగుసలాడుతూ, "ఈ మోహనాంగి, మహారాజుగారి బంధువులమ్మాయి అయి వుంటుంది! ఆడపిల్ల అంటే, ఇలావుండాలి. మన యువరాణివారు వున్నారు. ఎందుకూ? ఈ సుందరి కాలిగోటికి సరిపోతుందా?" అనుకోసాగారు.



చేదు వాస్తవం ఆమెకు మనశ్శాంతి లేకుండా చేసేది.

ఈ పరిస్థితుల్లో, ఆమె పుట్టినరోజు పండుగ వచ్చింది. ఎప్పటిలా అప్పుడు కూడా మహారాజు కొన్ని వినోద కార్యక్రమాలు ఏర్పాటు చేశాడు. అన్నిటికీ చివరగా, ఒక ఇంద్రజాలికుడు తన బృందంతో ఇంద్రజాల ప్రదర్శనలివ్వ వచ్చాడు. అతడివెంట పెళ్ళీడు కొచ్చిన కుమార్తె వున్నది. ఆమె మెడనుంచి డోలు ఒకటి వేళ్ళాడుతున్నది.

ఇంద్రజాలికుడు, ఒక మామిడి టెంకమీద గంపను బోర్లించి, రాగికట్లతో వున్న ఒకచిన్న దండాన్ని దానిచుట్టూ తిప్పుతూ, ఏవో మంత్రాలు చదవసాగాడు. అతడి కూతురు డోలు వాయించడం ప్రారంభించింది. కొద్ది సేపు తర్వాత అతడు గంప పైకెత్తాడు. అక్కడ ఒక చిన్న మామిడి చెట్టూ, దాని కొమ్మకు ఒక దానిమ్మపండూ కనిపించాయి.

"ఇది కొత్తరకం ఇంద్రజాలం. అద్భుతం!" అంటూ ప్రేక్షకులు చప్పట్లు చరిచారు.

ఇంద్రజాలికుడు నవ్వి, "మామిడిచెట్టు దానిమ్మపండు కాసింది. అయ్యలారా! దీని రుచిఎలావున్నదోచూడండి!" అంటూ పండును ముక్కలుగాకోసి, దాపులనున్న ప్రేక్షకులకిచ్చాడు.

వాళ్ళు వాటిని తింటూనే, "ఆహా! మహాద్భుతం! చూపులకు దానిమ్మపండు, రుచి మాత్రంజామపండుది," అంటూ పెద్దగా చప్పట్లు చరిచారు. రాజూ, పక్కన వున్న ఆసనంలో కూర్చునివున్న యువరాణి కూడా ఆశ్చర్యపోతూ చప్పట్లు చరిచారు.

ఆ తర్వాత, ఇంద్రజాలికుడు మరికొన్ని అద్భుతాలు ప్రదర్శించి, చివరగా రాజుకు

యువరాణి, తన చెలికత్తెల ముఖ కవళికలనుబట్టి, వాళ్ళనుకుంటున్నదేమిటో గ్రహించి, ఒకసారి చిన్నగా నిట్టూర్చి, "ఏమే, మల్లికా, వసంతా, ఏమిటలా నాకేసి వింతగా చూస్తున్నారు? ఇటురండి!" అన్నది.

యువరాణి కంఠస్వరం పోల్చుకుని, చెలికత్తెలిద్దరూ ఆమెను సమీపించి, "క్షమించండి, యువరాణీ! ఏ మహర్షి వరమో తమరు దేవకాంతలను తలదన్నేలా వున్నారు. ఆహా!" అంటూ అభినందించారు.

అయితే, యువరాణినిప్పుడొక కొత్త దిగులు పట్టుకున్నది. అందరికీ తను ఇప్పుడు జగన్మోహనంగా కనిపించినా, తనకళ్ళకు మాత్రంమునుపటికురూపిరూపంలోనే కనిపించడం, ఆమెకు నిరాశకలిగించింది. అద్దంలో తన ప్రతిబింబం చూసుకున్నప్పుడల్లా, ఈ

తన కుమార్తెను చూపుతూ, "ప్రభూ! ఈమె నా ఒక్కగానొక్క కూతురు. నాకళ్ళకు నాగ కన్యలా కనిపిస్తుంది. కాని, నేను దీని పెళ్ళి చేయాలని ప్రయత్నిస్తే, ప్రతి ఒక్కడూ పెద్ద అనాకారి, అంటూ పారిపోతున్నాడు. ప్రభువులూ, రసజ్ఞులైన ప్రేక్షకులూ నాకుమార్తె ఎలాంటి అందగత్తో చూడండి!" అంటూ మంత్రోచ్చారణతో, ఆమె తలకు చేతిలోవున్న మంత్రదండాన్ని తాకించాడు.

ఆ మరుక్షణం, ఇంద్రజాలికుడి కుమార్తె, మిలమిల మెరుస్తున్న వస్త్రధారణతో, తలమీద పాముపడగ ఆకారంలోవున్న మేలిమి బంగారు కిరీటంతో ప్రేక్షకులకు మెరుపులా కనిపించింది. రాజుతో, పాటు ప్రేక్షకులందరూ అద్భుతాశ్చర్యాలతో హర్షధ్వానాలు చేశారు.

ఇంద్రజాలికుడు వినయంగా తలవంచి సభకునమస్కరించి, మంత్రదండంతో తాకించికుమార్తెను ఎప్పటిలాచేసి, "ప్రభువులకూ, సభికులకూ ఒక చిన్న మనవి. ఇంతవరకూ నేనుచేసినవేవీ నిజంకాదు; ఇంద్రజాలవిద్యతో కల్పించిన భ్రమలు!" అన్నాడు.

రాజు, ఇంద్రజాలికుణ్ణి ప్రశంసించి,భటుడి ద్వారా వెయ్యి బంగారు నాణాలు కానుకగా ఇచ్చాడు. వేదికమీద తల్లిదండ్రుల పక్కన కూర్చుని, ఇంద్రజాలికుడి ప్రదర్శన చూస్తున్న యువరాణి హృదయంలో, ఒక అనిర్వచనీయమైన భావసంఘర్షణ మొదలైంది. ప్రదర్శన ముగిసిన వెంటనే, ఆమె ఒక నిర్ణయానికి వచ్చి, ఆసనంమీదినుంచిదిగి ఇంద్రజాలికుణ్ణి సమీపించి, మహిమగలఉంగరాన్ని అతడి చేతిలో పెట్టి, "ఇదినీకు నా పుట్టినరోజుకానుక. ఈ ఉంగరంలో నీ ఇంద్రజాలానికి సరితూగగల గంధర్వమాయ వున్నది! తీరుబడిగా పరీక్షించి చూసుకో," అని అక్కడి నుంచి తిరిగి చూడకుండా అంతఃపురానికి వెళ్ళిపోయింది.



బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా,కురూపిగా జన్మించిన రాకుమారికి, గంధర్వకన్య ఇచ్చిన మహిమగల ఉంగరం, నిజంగా వరప్రసాదమే గదా! ఆ ఉంగరం సాయంతో తనకునచ్చిన, ఏ రాకుమారుణ్ణో వివాహమాడవచ్చు కదా! అలాచేయక, ఆ అమూల్యమైన ఉంగరాన్ని ఇంద్రజాలికుడికి బహూకరించడం వెర్రితనం కాదా? ఆ క్షణంలో ఆమెకు మతిచాంచల్యం కలిగిందనో, లేక ఇదీఅని చెప్పలేని నైరాశ్యం వల్ల మూర్ఖంగా ప్రవర్తించిదనో అనుకోవలసిందే గదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీతల పగిలిపోతుంది." అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "గంధర్వకన్య, యువరాణి మణిమంజరికిచ్చిన ఉంగరం మహిమగలదైనా, ఆ మహిమకు కొన్నిపరిమితులున్నాయని తెలుస్తూనే వున్నది. ఇతరులు చూసి ప్రశంసిస్తున్న రూపం తనది కాదనీ, గంధర్వకన్య నుంచి అరువుతెచ్చుకున్నదనీ, ఆత్మాభిమాని అయిన యువరాణి ఎన్నటికీ మరిచిపోలేదు. అంతేకాక, ఆ ఉంగరాన్ని ధరించి, ఆమె దైవసన్నిధికి వెళ్ళే అవకాశం లేదు: అప్పుడు ఉంగరం తన మహిమను కోల్పోయి, తన కురూపిరూపం బయటపడుతుంది. ఇక, వివాహ విషయానికి వస్తే, తన పరిస్థితికీ, ఇంద్రజాలికుడి కుమార్తె పరిస్థితికి తేడా ఏమీ లేదు. నిజజీవితంలో ఆమె నాగకన్యా కాదు, తను గంధర్వకన్యా కాదు. ఒకటి ఇంద్రజాలం, రెండవది గంధర్వమాయ! ఆమె ఇంద్రజాలికుడి ప్రదర్శనచూశాక వాడు జీవనోపాధికిచేస్తున్న ప్రదర్శనలాంటిదే, భవిష్యత్తులో భర్తను ఎన్నుకునే విషయంలో తను చేయబోతున్నాననేఊహ, ఆమెను చిత్తక్షోభకుగురి చేసిందన్నది వాస్తవం. మంత్ర తంత్రాల వల్ల, మహిమలవల్ల అరువుతెచ్చుకునే అందం శాశ్వతం కాదనీ, అలాంటివి ఆత్మసంతృప్తినీ, ఆనందాన్నీ కలిగించలేవనీ గ్రహించడం వల్లనే, ఆమె ఉంగరాన్ని ఇంద్రజాలికుడికి బహుమతిగాఇచ్చి, తనవిజ్ఞతనూ, విశాలహృదయాన్నీ చాటుకున్నది. ఇలాంటిది హృదయ నైర్మల్యంకలవాళ్ళు చేసే పనితప్ప, మందమతులూ, మూర్ఖులూ చేసేది కాదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం: రాఘవరాజు పట్టాభిరామరాజు రచన]





# పెంపుడుకొడుకు

ఒక గ్రామం చివరన, అడవికి దగ్గిరగా కుటీరం వేసుకుని ఒక వయసుమళ్ళిన స్త్రీ తన కొడుకుతోసహా జీవిస్తూ ఉండేది. ఆమె రోజూ అడవికి వెళ్ళి, మోదుగ ఆకులూ, చీపిరిపుల్లలూ తెచ్చేది. మోదుగ ఆకులతో విస్తళ్ళు కుట్టేది. చీపిరిపుల్లలతో చీపిరికట్టలు కట్టేది. అవి అమ్మి, [redacted] డబ్బుతో, సంసారం నడిపేది. ఒక్కొక్కసారి ఎండుపుల్లలు ఏరుకుని వచ్చేది.

ఆమె కొడుకు వట్టి అప్రయోజకుడు. తల్లికి సహాయపడకపోగా, డబ్బు తెమ్మని పీడించేవాడు. సోమరిపోతులా తిరిగేవాడు. తల్లివాణ్ణి లక్ష్యపెట్టటం మానేసింది. వాడుకూడా తల్లితో విసిగి ఎటో వెళ్ళిపోయాడు.

ఆమెకు క్రమంగా శక్తి ఉడుగుతూ వస్తున్నది. ఒకనాడు అడవిలో పుల్లలు ఏరుతూ, ఎండదెబ్బకు సొమ్మసిల్లి పడిపోయింది. ఆ సమయంలో ఒక యువకుడు అటుగావచ్చి, పడిపోయిన ముసలిదాన్ని చూశాడు. వెంటనే వాడు సమీపంలో ఉన్న నీటిమడుగు నుంచి తామరాకుతో నీరు తెచ్చి, ముసలిదాని ముఖానచల్లి, కొద్ది సేపటికల్లా స్పృహ తెప్పించాడు.

ముసలిదిలేచికూర్చుని, "ఎవరు నాయనా, నువ్వు?" అని అడిగింది.

"నేను దిక్కులేని ఒంటరిగాణ్ణి, తల్లీ. చిన్నప్పుడే తల్లీ తండ్రీ పోయారు. ఎక్కడన్నా ఎవరన్నా దగ్గిర పెట్టుకుంటారేమోనని ఊళ్ళ వెంటతిరుగుతున్నాను," అన్నాడు యువకుడు.

ముసలిది లేచి, తాను కట్టుకున్న పుల్లల మూట నెత్తికి ఎత్తుకోబోయింది. యువకుడు ఆమెను వారించి, మూట తన నెత్తికిఎత్తుకుని, "పదమ్మా, దీన్ని నేను మీ ఇంటిదాకా తెస్తాను," అన్నాడు.

ఇంటికి వెళ్ళాక ముసలిది వాడితో, "నీకు మంచి చోటు దొరికేదాకా నా ఇంట్లోనేఉండు

25- ఏళ్ళనాటి చందమామ కథ

నాయనా, అందువల్ల నాకు ఇబ్బంది ఏమీ లేదు," అన్నది.

వాడు ఇంకెక్కడికీ వెళ్లలేదు. ముసలి దాని వెంటే ఉండి, అమెను ఏ పనీ చెయ్య నివ్వక, ఆమె చేసే కష్టమైన పనులన్నీ తానే చురుకుగా చేస్తూ, అక్కడే ఉండిపోయాడు.

ముసలిది ఇప్పుడు మోదుగాకుల కోసమూ, మూలికలకోసమూమాత్రమే అడవిలోకి అప్పు డప్పుడూ వెళుతున్నది. మిగతా పనులన్నీ ఆ యువకుడే చేస్తున్నాడు. ఇద్దరూ తమ శక్తి కొద్దీ సంపాదిస్తున్నారు. ఖర్చుకు పోగా డబ్బు మిగులుతున్నది.

ముసలిదాని కొడుకు ఒకనాడు ఎక్కడి నుంచో హఠాత్తుగా ఊడిపడ్డాడు. ఇంటి పరిస్థితి బాగయిందని గ్రహించాడు. తల్లిని డబ్బుకోసం పీడించాడు.తల్లి చిల్లిగవ్వ కూడా ఇవ్వనన్నది.

ముసలిదాని అసలు కొడుకు పెంపుడు కొడుకుతో తగాదాలు పెట్టుకున్నాడు. కొత్త వాణ్ణి ఏ విధంగానన్నా భయపెట్టి ఇంటి నుంచి పంపేస్తే తల్లి తనని ఆదరిస్తుందని వాడి నమ్మకం.వాళ్ళు ఇద్దరూ ఇంట్లో లేని సమయంలో ఆమె డబ్బంతా మూటగట్టి రహస్యంగా ఒకచోట దాచి, ఇంట్లో ఉన్న వస్తువులు చిందర వందరగా పారేసి, కుయ్యో మొర్రో అని ఏడుస్తూ కూర్చున్నది.

ఇంతలో ముసలిదాని అసలు కొడుకు వచ్చాడు. ఇంట్లో దొంగలు పడ్డారని ముసలిది చెప్పింది. "నువ్వు వట్టి పాపిష్టిదానివి.డబ్బు నా కియ్యమంటే ఇచ్చావుకావు. నీకు తగిన శాస్తే జరిగింది. నీ మొహం చూస్తే పాపం! ఇకపై నీ ఇంట ఒక్క క్షణంకూడా ఉండను!" అంటూ ముసలిదాని అసలు కొడుకు వెళ్ళి పోయాడు.

వాడు వెళ్ళిపోకముందే ముసలిదాని పెంపుడుకొడుకు వచ్చి జరిగినదంతా చూశాడు. తరవాత వాడు ముసలిదాన్ని ఓదార్చుతూ, "ఏడవకమ్మా! అ డబ్బు పోతే పోయింది. మనం సంపాదించిన డబ్బే గదా! మళ్ళీ కష్టపడి సంపాదింతాం!" అన్నాడు.

"డబ్బెక్కడికి పోయింది, నాయనా! అ వెధవ వెళ్ళిపోయాడు. దీంతో వాడి పీడ విరగడయింది. డబ్బు భద్రంగానే ఉన్నది," అంటూ ముసలిది దాచినచోటినుంచి డబ్బు మూట బయటికి తీసింది సంతోషంగా.



# కోరమండల్ తీరం




మన్నారు సింధుశాఖను దాటి మరికొంత దూరం ముందుకు వెళ్ళామంటే కోరమండల్‌తీరం చేరుకుంటాం. 'నైటింగేల్ ఆఫ్‌ఇండియా' అని ప్రసిద్ధిగాంచిన కవయిత్రి సరోజినీ నాయుడు "ది కోరమండల్ ఫిషర్స్" అనే కవితతో కీర్తించిన కోరమండల్ తీరం దేవాలయాలకు ప్రసిద్ధిగాంచినది. కోరమండల్ తీరంలో వేలాంకన్నిలోని 'చర్చ్ ఆఫ్ అవర్ లేడీ ఆఫ్ హెల్త్' అనే 'ఆరోగ్యమాత' ఆలయం చాలా ప్రసిద్ధమైనది. ఇక్కడికి అసంఖ్యాకంగా వచ్చే భక్తులు తమ వ్యాధులు నయమయినందుకు కృతజ్ఞతగా వెండి, బంగారు లోహాలతో తయారుచేసిన కళ్ళు, చెవులు,కాళ్ళు, చేతులు అంటూ వివిధ అవయవాలను ఆరోగ్యమాతకు కానుకగా సమర్పించి మొక్కులు తీర్చుకుంటారు. ఇటువంటి వస్తువులను చర్చ్ ప్రదర్శనకు ఏర్పాటుచేసి ఉన్నది. గోడల మీద బైబిల్ కథలు బొమ్మలతో చిత్రించబడిన మార్గంగుండా వెళ్ళామంటే సముద్రతీరంలో మొట్టమొదట నిర్మించబడిన చర్చ్‌ని చేరుకుంటాము.



వేలాంకన్ని ఆరోగ్యమాత ఆలయం

వేలాంకన్నికి కొన్ని కి.మీ. ఉత్తరంగా నాగపట్నం అనేచిన్న రేవుపట్టణం ఉన్నది. ఇది ప్రాచీన కాలంలో ప్రసిద్ధిగాంచిన రేవుపట్టణం. క్రీ.శ. 5వ శతాబ్దంలో ఇది పల్లవులకు ముఖ్యమైన నౌకాకేంద్రంగా ఉండేది. దీనికి 24 కి.మీ. పడమరగా శ్రీత్యాగరాజస్వామి జన్మస్థానమైన తిరువయ్యారు అనే పంచనదీ క్షేత్రం ఉన్నది. కర్నాటక సంగీత సంప్రదాయంలో త్రిమూర్తులుగా కీర్తించబడేవారు శ్రీత్యాగరాజు, ముత్తుస్వామి దీక్షితులు,





కర్నాటక సంగీత త్రిమూర్తులు

శ్యామాశాస్త్రి.

నాగపట్నానికి నాలుగు కి.మీ. ఉత్తరంగా హజ్రత్ మియాన్ అనే హజ్రత్ మీరాస్ సుల్తాన్ సయ్యద్ షా అబ్దుల్ హమీద్ దర్గా ఉన్న నాగూర్ ఉన్నది. 500 సంవత్సరాల పురాతనమైన ఈ దర్గాను అందరూ దర్శిస్తారు. దీని బంగారు గుమ్మటం చుట్టూ 5 మినార్లు ఉన్నాయి. దర్గాలోపల ఉన్న కొలనులోని నీటికి రుగ్మతలను పోగొట్టే అద్భుతశక్తి ఉన్నదని చెబుతారు.

తాటాకులతో హస్తకళానైపుణ్యం ఉట్టిపడే అందమైన సంచులు, విసనకర్రలు, చాపలు మొదలైన వస్తువులు తయారుచేయడంలో కూడా నాగూరుకు పేరున్నది.

ఇంకా కొంతదూరం ఉత్తరంగా పయనించామంటే మరొక ప్రాచీన క్షేత్రమైన కారైక్కాల్ చేరుకుంటాము. పాండిచ్చేరి కేంద్రపాలిత ప్రాంతంలోని నాలుగు జిల్లాలలో ఇది ఒకటి.

క్రీ.శ. 6వ శతాబ్దానికి చెందిన భక్తకవయిత్రి కారైక్కాల్ అమ్మైయార్ ఇక్కడికి చెందినవారే. శైవభక్తి సాహిత్యంలో ఆమె రచించినవే చాలా ప్రాచీనమైన గీతాలని చెబుతారు. అర్పుద తిరువందాది; ఇరట్టై మణిమాలై; మూత్త తిరుప్పటికంగళ్ ఆమె రచించిన ముఖ్యమైన మూడు గ్రంథాలు.

కారైక్కాల్ అమ్మైయార్ భర్త, ఆమెకేవో అద్భుత శక్తులున్నాయని పసికట్టి ఆమెను వదిలి వెళ్ళాడు. భర్త ప్రవర్తనకు బాధపడిన కారైక్కాల్ అమ్మైయార్ వైరాగ్య భావంతో ఇల్లు వదిలింది. సన్యాసినిలా దేశాటనం చేస్తూ, శివాలయాలు దర్శిస్తూ, భక్తిగీతాలతో శివుణ్ణి స్తుతిస్తూ శేషజీవితం గడిపింది. ఆమె రచించిన భక్తిగీతాలు ఆమె పేరును తమిళసాహిత్యంలో చిరస్థాయిగా నిలిచేలాగా చేశాయి. ఆ భక్త కవయిత్రి పేరుమీదుగా కారైక్కాల్‌లో ఒక ఆలయం ఉన్నది.



డేన్స్‌బర్గ్ భవనం

దీని తరవాత ట్రాంకొబార్ అనే తరంగంబాడి చేరుకుంటాము. ఇది ఒకప్పుడు డేనిష్ కాలనీగా ఉండేది. ఆసియాఖండంలో 1620 నుంచి 1840 వరకు డేనిష్ అధికారంలో ఉన్న ఏకైక ప్రాంతం ఇది.ప్రధాన పట్టణం మాత్రం ఇంకా ఆరంభంలో నిర్మించినట్టే ఉన్నది. డేన్స్‌బర్గ్ భవనం; పౌరులు వెలుపలికి వెళ్ళడానికి, రావడానికి 200 సంవత్సరాల నాడు నిర్మించినద్వారం; కట్టకడపటి డేనిష్ గవర్నర్ జాన్స్ రెల్లింగ్ 1823 నుంచి 1841 వరకు నివసించిన రెల్లింగ్స్ గార్డ్, మరి రెండు చర్చ్‌లు ఒకప్పటి డేనిష్ వైభవానికి సాక్ష్యాలుగా నిలిచి ఉన్నాయి.

తరంగంబాడికి ఉత్తరంగా కావేరీనది సముద్రంలో సంగమించేచోట పూంబుహార్ ఉన్నది. ఇది ఒకప్పుడు సుసంపన్నమైన చోళుల రేవుపట్టణం. ఇక్కడి నుంచి మియాన్మార్, శ్రీలంక, మలేసియా, ఇండో-చైనా, చైనా వంటి దేశాలతో నౌకావ్యాపారం జరిగేది.

ఇక్కడ పూర్వకాలంలో యేటా వేసవిలో ఇంద్రపూజ జరిగేది. కారణాంతరాల వల్ల ఒకయేడుఇంద్రపూజ జరగలేదు. అందుకు ఆగ్రహం చెందిన సముద్రం పొంగి నగరాన్ని కబళించిందని ఒక కథ చెబుతారు.అయితే, పూంబుహార్ పరిసరాలలోని కీళైయూర్‌లో 1962లో త్రవ్వకాలు జరిపి పురాతత్వ శాఖ



పూంబుహార్ ఆర్ట్‌గ్యాలరీ

సముద్రంలో పరిశోధనలు జరిపినప్పుడు –ప్రాచీన నగరం ఒకటి సముద్రంలో మునిగిపోయిన ఆధారాలు బయట పడ్డాయి. ఒకప్పుడు పూంబుహార్ బౌద్ధమతానికి కేంద్రంగా ఉండేది. బౌద్ధమత ప్రచారం కోసమే సుప్రసిద్ధ తమిళ కావ్యమైన 'మణి మేఖలై' రచింపబడింది. పూంబుహార్ నుంచి మరికొంత దూరం ఉత్తరంగా పయనించామంటే నటరాజ మందిరానికి ప్రసిద్ధిగాంచిన చిదంబరం చేరుకుంటాము. నగరమధ్యంలో నటరాజ మందిరం ఉన్నది. ఇది యావత్ భారత ప్రసిద్ధిగాంచిన శివాలయం.

ఒక పురాణ కథ ప్రకారం ఒకప్పుడిక్కడ శివపార్వతుల మధ్య నాట్యం పోటీ జరిగింది. శివుడికి సమానంగా పార్వతీ; పార్వతికి తీసిపోకుండా శివుడూ నాట్యంచేశారు. ఇరువురిలో ఎవరు గొప్పగా నాట్యం చేశారో నిర్ణయించడానికి అక్కడ చేరిన దేవతలకూ, మునులకూ సాధ్యపడలేదు. ఆఖరికి శివుడు యోగశక్తితో ఒంటికాలిమీద నిలబడి, రెండవ కాలిని భుజం మీదికి ఎత్తి పార్వతికేసి చూశాడు. పార్వతి వినయంగా తన ఓటమిని అంగీకరించింది.

ఈ భంగిమలోని శివుడి విగ్రహం ఒకటి ఆలయమంటపంలోఉన్నది. ఈ విగ్రహం పంచలోహాలమిశ్రమంతో తయారు చేయబడింది. మంటపం లోపల రాగిరేకులు బంగారం పూతతో తాపడం చేయబడి ఉన్నాయి.

చిదంబరానికి ఉత్తరంగా ఉన్న కేంద్ర పాలిత ప్రాంతమైన పాండిచ్చేరి ఉజ్వలమైన చరిత్ర కలిగిన నగరం. ఇది ఈ ప్రాంతానికి రాజధాని. క్రీ.శ.1వ శతాబ్దం నుంచే రోమన్లు, పోర్చుగీసులు, ఫ్రెంచివాళ్ళు, డచ్‌వాళ్ళు, బ్రిటిష వాళ్ళుఇక్కడ వర్తకస్థావరాలను ఏర్పాటు చేసుకున్నారు. 1814 నుంచి 1954 వరకు ఇదిఫ్రెంచి అధికారంలో ఉండేది.

భారత స్వాతంత్ర్య పోరాట కాలంలో మన స్వాతంత్ర్య యోధులకు ఇది ఒక కోటలా ఉండేది. సుప్రసిద్ధ తమిళకవి సుబ్రహ్మణ్యభారతి ఇక్కడ ఉన్నప్పుడే పలు దేశభక్తి గీతాలను రచించి ప్రజలలో దేశభక్తిని ప్రేరేపించాడు. భారతియార్



చిదంబర నటరాజవిగ్రహం

తమిళసాహిత్యంలో నూతన శకానికి నాంది పలికి, నవయుగ వైతాళికుడయ్యాడు. కణ్ణన్‌పాట్టు, కుయిల్ పాట్టు, పాంచాలిశపథం మొదలైనవి అయన సుప్రసిద్ధ రచనలు. శ్రోతలకు ఉత్తేజాన్నీ, ధర్మావేశాన్నీ కలిగించే ఆయన గీతాలు తమిళనాట ఈనాటికీ విని పిస్తూనే ఉన్నాయి. ఆయన నివసించిన 20,ఈశ్వరన్ ధర్మరాజా కోయిల్ వీధిలోని ఇంటిని జాతీయ స్మారకగృహంగా మనప్రభుత్వం ప్రకటించింది.


శ్రీ అరవిందులు

పాండిచ్చేరికివచ్చి స్థిరపడిన మరొక స్వాతంత్ర్యయోధుడు శ్రీఅరవిందఘోష్. ఆయన 1920వసం॥లో పాండిచ్చేరికి వచ్చి ఆధ్యాత్మిక జీవితాన్ని ప్రారంభించాడు. 'లైఫ్ డివైన్,' సావిత్రి వంటి గొప్ప గ్రంథాలను రచించడంతో పాటు భగవద్గీత, వేదాలు, ఉపనిషత్తులు మొదలైన వాటికి వ్యాఖ్యానాలు వెలయించాడు.

తన ఆదర్శమైన ప్రశాంత జీవనవిధానాన్ని ఆచరణలో పెట్టడానికి అనువుగా శ్రీ అరవిందులు మదర్ సహకారంతో ఒక ఆశ్రమం స్థాపించాడు.

భక్తులచే శ్రీమాత అని పిలువబడే మదర్ అసలుపేరు మిర్రా అల్ఫాసా. ఫ్రాన్స్ దేశానికి చెందిన ఈమె అరవిందుల శిష్యురాలై ఆయనకు 1920 నుంచి 1950లో ఆయన కాలధర్మం చెందేంతవరకు సాయంగా నిలబడ్డారు. అరవిందుల అనంతరం ఆయన ఆధ్యాత్మిక వారసురాలిగా జీవితాంతం అంటే–1973 వరకు కొనసాగారు.

పాండిచ్చేరికి 8 కి.మీ. దూరంతో ఆరొవిల్(ఉదయనగరం) అనే ఆదర్శ ప్రదేశం 1968లో అరవిందుల స్మృతి చిహ్నంగా రూపొందించబడింది. సత్సంకల్పంతో, ఉన్నతాశయ సిద్ధికోసం త్రికరణ శుద్ధిగా సాధనచేసే మానవులు ప్రపంచపౌరులుగా, ప్రశాంతంగా ఏకైక అధికారమైన మహోన్నత సత్యం నీడలో సాధన చేయడానికి మరేదేశం కాని తనదని చెప్పుకోని — ప్రశాంత ప్రదేశం ఒకటి కావాలి అని అరవిందులు ఆశించారు. ఆయన ఉదాత్త ఆశయానికి రూపకల్పనే — ఆరొవిల్!


ఆరొవిల్‌లోని మాతృమందిర్



# ఊరుకదలనివాడు

చపలపురంలో చలపతి అనే అతడికి బంధుప్రీతి ఎక్కువ. అతడి భార్య అరుణ కూడా ఇంటికొచ్చిన వారిని ఎంతో చక్కగా ఆదరిస్తుంది. ఆ దంపతుల గురించి బంధువుల్లో గొప్పగా చెప్పుకుంటారు.

బంధుప్రీతి మాత్రమే గాక చలపతికి మంచి మాటకారితనం కూడా వున్నది. అతడితో ఎంతసేపు మాట్లాడినా తనివి తీరదని చాలామంది అంటారు.

ఉగ్రనగరంలో ఉమాపతి అనే ఆయన వుంటున్నాడు. అతడు ఆస్తిపరుడే కానీ ఉన్నచోటు నుంచి కదలడు. తన తల్లిని మించిన గొప్ప వ్యక్తికానీ, ఉగ్రనగరానికి మించిన ఊరు కానీ వున్నదంటే ఒప్పుకోడు. ఒకపట్టాన ఏ పిల్లానచ్చక చాలా ఆలస్యంగా పెళ్ళిచేసుకున్నాడు. అతడి భార్య కరుణ అందం,చలాకీతనం, తెలివి, మంచితనం కలబోసిన పిల్ల.

మాసం రోజుల్లోనే కరుణకు, భర్తంటే విసుగు పుట్టింది. అతడికి కొన్ని విషయాలు తెలుసు. అవే అందరికీ చెబుతాడు తప్ప కొత్త విషయాలు నేర్చుకోడు, తెలుసుకోడు. తను చాలా గొప్పవాడిననుకుని, తరచు తననుతనే పొగడుకుంటాడు. ఎదుటివాళ్ళను దేనికీ మెచ్చుకోడు సరికదా, చిన్నబుచ్చుతాడు కూడా!

ఒకసారి ఊరు కదిలితే తప్ప భర్తకు ప్రపంచం తెలియదని కరుణ అనుకున్నది. ఆమెకు చలపతి దూరపు వరుసలో అన్న అవుతాడు. అతడొక్కడే తన భర్తను మార్చగలడన్నఉద్దేశ్యంతో,ఆమె ఒకరోజున భర్తతో, చపలపురం వెళదామన్నది. అనుకున్నట్టే ఉమాపతి రానన్నాడు.

“చపలపురం, ఉగ్రనగరం కంటే వెయ్యిరెట్లు గొప్పగా వుంటుంది. అక్కడ చలపతి అని, మా పెదనాన్న కొడుకున్నాడు. ప్రపం

“సహ. వర”



చంలో అతడికి తెలిసినన్ని విషయాలింకె వరికీ తెలియవంటారు. మనం అక్కడికి వెళితే నువ్వు గొప్పో, నా అన్న గొప్పో తేలి పోతుంది," అంటూ కరుణ, భర్తను రెచ్చ గొట్టింది.

ఉమాపతికి పౌరుషం వచ్చి మర్నాడే చపలపురం బయల్దేరాడు.

ఉమాపతి దంపతులను, చలపతి దంప తులు ఎంతోఆప్యాయంగా ఆహ్వానించి ఆద రించారు. అతిథులకోసం అరుణ కొత్తరకం పాయసం వండింది. కరుణ ఆ పాయసం రుచిని ఎంతగానో మెచ్చుకున్నది.

ఉమాపతి మాత్రం ముఖం చిట్లించి, "పాయసమంటే చిక్కని గేదెపాలుండాలి. అందులో ఉగ్రనగరం జీడిపప్పు కలపాలి. ఆపైన మా అమ్మచేయి పడాలి, ఆ రుచి చూసినవాడికి ఇంకేదీ పాయస మనిపిం చదు," అన్నాడు.

ఈ మాటలకు అరుణ చిన్నబుచ్చు కున్నది. చలపతిమాత్రం మాటలు తప్పిస్తూ, "బావగారు తెలివిగా మమ్మల్ని ఉగ్రనగరం రమ్మని ఆహ్వానిస్తున్నారు. మేము ఉగ్రనగరం వస్తే, ఒక్క పాయసంతో విడిచిపెట్టం. అత్తయ్యగారిచేత ఎన్నో రకాల పిండివంటలు చేయించుకుని తింటాం," అన్నాడు.

ఆ రాత్రి చలపతి అతిథులకోసం బూరుగు దూది పరుపులు పంపించాడు. ఉమాపతి అందుకు మెచ్చుకోకుండా, "వాతావరణం ఉక్కగా ఉన్నప్పుడు ప్రత్యేకంగా బూరుగు దూది సుఖంగా వుండదు. మా ఊళ్ళో శరీరానికి చల్లగా అనిపించే కొత్తరకం దూది దొరుకుతుంది," అన్నాడు.

ఈపర్యాయం చలపతికూడాచిన్న బుచ్చు కోవడం గమనించిన కరుణ, అన్నగారిని చాటుగా పిలిచి, భర్తకున్న దుర్గుణం చెప్పి, నీవైతే ఎదుటి వారిలో లోపాలున్నా చెప్ప కుండా మెచ్చుకుంటావు. నా భర్తకు చీటికీ మాటికీ ఎదుటివారిని చిన్నబుచ్చే దుర్గుణ మున్నది. మనిషి మంచివాడే కానీ, ఈ దుర్గుణం పోగొట్టాలని నీ వద్దకు తీసుకొ చ్చాను. నువ్వే ఏదైనా ఉపాయమాలో చించు," అన్నది.

"అసలు విషయం ముందే చెప్పి రక్షిం చావు. ఇక అంతా నేను చూసుకుంటానులే!" అన్నాడు చలపతి.

మర్నాడుదయం చలపతి, ఉమాపతితో ఆ ఊళ్ళోనే వుంటున్న తన దూరపుబంధువు ముకుందుడి గురించి చెప్పాడు.

ముకుందుడు కూతురికి పెళ్ళిచేశాడు. చలపతి అయిదువందల వరహాలిచ్చి సాయం చేశాడు. ముకుందుడిల్లు కూలిపోయింది. చలపతి తాటివాసాలు దానం చేశాడు. ముకుందుడికి జబ్బుచేసింది. చలపతి చిట్కా వైద్యం చేసి తగ్గించాడు. ముకుందుడు చలపతి నుంచి ఎన్నో సాయాలు పొందాడు. కానీ ముకుందుడు, చలపతి గురించి ఒక్క మంచి ముక్క అనడు. పైగా దుష్ప్రచారం చేస్తాడు.

ఇద్దరూ కలిసి ముకుందుడింటికి వెళ్ళారు. ముకుందుడు, చలపతిని పట్టించుకోకుండా, ఉమాపతితో బాగా మాట్లాడాడు. చలపతి ఎంత మర్యాదగా మాట్లాడినా, ఛీత్కారంగా బదులిచ్చాడు. వెళ్ళేటప్పుడు మాత్రం, "రేపు ఎడ్లజత బేరం చేస్తున్నాను. పాతికవరహాలు తక్కువకావచ్చు. లేదనకుండా సిద్ధం చేసి వుంచు," అన్నాడు.

అక్కణ్ణించి బయటపడ్డాక ఉమాపతితో, "ఇలాంటి వాడితో నేనేం చేయాలో నువ్వే చెప్పు," అన్నాడు చలపతి.

ఉమాపతి ఆలోచిస్తూ, "ముకుందుణ్ణి చూడగానే నాకు మా ఊళ్ళోని గోవిందుడు గుర్తొచ్చాడు. నేను ముకుందుణ్ణి పట్టించుకోలేదు. మా గోవిందుడి గురించే ఆలోచిస్తున్నాను. మా ఊళ్లో నీలాంటివాళ్ళు గోవిందుడి గురించి నా దగ్గర ఫిర్యాదు చేశారు. నాకు మాత్రం మా గోవిందుడు ప్రవర్తనలో తప్పేం కనిపించలేదు. అతడు నాతో బాగా వుంటాడు. నీకు మనుషులతో మసలడం తెలియదని నానమ్మకం.మనుషులతో ఎలా మసలాలో, నాకు మా అమ్మ నేర్పింది. నాతో అందరూ



బాగానే వుంటారు. ఎవరితోనూ ఇబ్బంది లేదు," అన్నాడు.

"మంచి ఉపాయం చెప్పావు. కృతజ్ఞుణ్ణి," అన్నాడు చలపతి.

"నేను ఉపాయం చెప్పానా, ఏమిటది?" అని ప్రశ్నించాడు ఉమాపతి ఆశ్చర్యంగా.

"నువ్వు మసలినట్టే, నేనూ ముకుందుడితో మసలాలి. అప్పుడే ఇబ్బందీ వుండదు. అదే కదా నీ ఉపాయం?" అన్నాడుచలపతి నవ్వుతూ.

ఉమాపతి క్షణంమాత్రంవెలవెలపోయినా, వెనువెంటనే తమాయించుకుని, "ఆఁ,మరే మరే!" అన్నాడు.

ఆ తర్వాత చలపతి, ఉమాపతికి తన ఊరి మామిడితోటలు చూపించి, "ఇక్కడ పశుగ్రాసంతో ఎరువు తయారుచేస్తారు. ఆ

కొత్తరకం ఎరువు కారణంగా, ఇక్కడి మామిడి పళ్ళరుచి వర్ణనాతీతం," అన్నాడు.

"పశుగ్రాసం ఎరువువల్ల మనుషులకు రాచపుండ్లు బయల్దేరతాయట. మా ఊళ్ళో రసాయనాల ఎరువులు వాడతారు. రుచికి రుచి, ఆరోగ్యానికి ఆరోగ్యం," అంటూ వెంటనే ఖండించాడు ఉమాపతి.

చలపతి అక్కణ్ణించి అతణ్ణి బట్టల దుకాణానికి తీసుకువెళ్ళాడు. ఆలయాలు చూపించాడు. ఊళ్ళోని ఎన్నో విశేషాలు చూపించాడు. ఏవీ కూడా ఉమాపతి తిన్నగా చూడలేదు. భార్యకరుణ తనుచూసిన వాటి నన్నింటినీ అదేవనిగా మెచ్చుకుంటే, ఉమాపతిమాత్రం తనఊరి వైభవాన్ని పదేపదే తలుచు కుని మురిసిపోయాడు తప్ప, చపలపురంలో దేన్నీకూడా పట్టించుకోలేదు.

అలా వారంరోజులు గడిచాక, ఉమాపతి దంపతులు తిరుగుప్రయాణమయ్యారు. కరుణ, చలపతి దంపతులను ఎంతగానో మెచ్చుకుని, "మీ ఆతిథ్యం రుచికరమైనది. మీ ఆత్మీయత మరిచిపోలేనిది. మీ ఊరొక అద్భుతం. ఇక్కడికి వచ్చినందుకు, నాకెంతో ఎంతో సంతోషంగా వుంది," అన్నది.

అప్పుడు చలపతి, కొద్దిదూరంలో వున్న ఉమాపతికేసి చిరునవ్వుతో చూస్తూ, "అయితే, ఈ విశేషాలన్నీ నీ భర్తకు చెప్పు. మరొకసారి మాఊరురా! ఈసారి వచ్చినప్పుడు, నీభర్తను కూడా వెంటబెట్టుకునిరా! మరిచిపోకు,సరా!" అన్నాడు.

కరుణ ఆశ్చర్యపడుతూ,"అదేంటన్నయ్యా, అలాగంటావు! ఆయనా నాతోపాటు వచ్చాడు గదా," అన్నది.

ఈసారి చలపతి పెద్దగా నవ్వి, "నిజం! వచ్చాడంటావా? నామటుకు నాకు, ఆయన ఉగ్రనగరం దాటినట్టు ఒక్కసారికూడా అని పించలేదు," అన్నాడు వెంటనే.

ఉమాపతి గతుక్కుమన్నాడు. చపల పురంలో ఏంచూసినా, తను ఉగ్రనగరాన్నే తలచుకోవడం వల్ల, ఇక్కడికి వచ్చికూడా రానట్టే అయిందని, అప్పటికి అతడు గ్రహిం చాడు.

ఆ తర్వాత నుంచి ఉమాపతి ఎక్కడకు వెళ్ళినా, తనకు తెలిసింది చెప్పడం తగ్గించి, తెలియంది నేర్చుకోవడం అలవాటు చేసు కున్నాడు. భర్తలోవచ్చిన ఈ మంచి మార్పుకు కరుణ సంతోషించింది.



# చందమామ బంగారు గడియలు-10





1. ...మంచు కప్పబడిన ఈ అగ్నిపర్వతం ఎక్కడ ఉన్నది? ఆదేశప్రజలు దీనిని పవిత్రంగా భావిస్తారు. దీని ఎత్తు 3,775 మీ॥ ప్రపంచంలోనే ఎక్కువసార్లు ఫొటో తీయబడిన పర్వతం కూడా ఇదే.

## ప్రపంచంలో వీటిని మనం ఎక్కడ చూడగలం?

2.... ష్వేడ్యాగన్ ఎక్కడ ఉన్నది?
ఈ స్తూపాన్ని స్వర్ణపగోడా అని కూడా అంటారు. 8, 868 పలుచటి బంగారు రేకులతో కప్పబడిన మెరిసే బౌద్ధ దేవాలయం ఇది.

3. బిగ్ బెన్ ఎక్కడ ఉన్నది?
ప్రపంచంలో చాలాప్రసిద్ధిగాంచిన గడియారంగంట ఇది.ఈ గంటను వేలాడ దీయ డాన్ని పర్యవేక్షించిన ఉద్యోగి పేరు మీదుగా దీనికి పేరు వచ్చిందని కొందరు చెబుతారు. ఒక సుప్రసిద్ధ బాక్సర్ పేరు మీదుగా దీనికి పేరు వచ్చిందని మరి కొందరు చెబుతారు. ఈ గంట బరువు 13 టన్నులకన్నా ఎక్కువ ఉంటుంది.



4. .... పొడ వాటి తోకతో రోమాలు గల సస్తన జంతు వును లెమూర్ అంటారా? కొన్ని లెమూర్లు కోతుల్లాగా ఉంటాయి. మరి కొన్ని చిన్నఎలుక ల్లాగానూ, ఉడతల్లాగానూ ఉంటాయి.



5. ...అతిపెద్ద భూనవనిర్మిత మైన అగాధం?
1871వసం॥లో ఇక్కడ వజ్రా లను కనుగొన్నారు. అప్పటి నుంచి 1915వ సం॥ వరకు ఇక్కడ త్రవ్వకాలు జరిగాయి. అప్పుడు 23 మిలియన్ టన్నుల బంకమన్ను, రాళ్ళు త్రవ్వి వెలుపలికి తీశారు. 2.7టన్నుల వజ్రాలుతీశారు. దీనివల్ల భూమిలో పెద్ద అగాధం(క్రాటర్)ఏర్పడింది.



కథా ప్రహేళిక

కుశాగ్రబుద్ధికీ, సునిశిత మేధాశక్తికీ పేరుగాంచిన గొప్ప అపరాధ పరిశోధకులు కూడా ఒక్కొక్కసారి పొరబాట్లు చేస్తూ ఉంటారు. షెర్లాక్ హెూమ్స్ ఇక్కడ చేసిన పొరబాటు ఏమిటో చెప్పగలరా?

# తప్పు చేశావ్ మిస్టర్ హెూమ్స్!

క్రిస్మస్ తరవాత రెండవరోజు ఉదయం నేను నా మిత్రుడు షెర్లాక్ హెూమ్స్‌ను చూడడానికి వెళ్ళాను. ఊదా రంగు దుస్తులతో సోఫామీద కూర్చుని, నోట్లో పైప్‌తో, చేతిలో ఉదయం వార్తాపత్రికలను తిరగేస్తున్నాడు. పక్కన చెక్కకుర్చీ, దాని వెనక మరీ మాసినదీ, చిరిగినదీ అయిన టోపీ వేలాడు తున్నది. దాని పక్కనే భూతద్దం మరికొన్ని పరికరాలు ఉండడంవల్ల, ఆ టోపీని పరిశీలించడానికే హెూమ్స్ దానిని అలా వేలాడదీశాడని గ్రహించాను.

"నీ పనికి అంతరాయం కలిగిస్తున్నానేమో!" అంటూ లోపలికి అడుగుపెట్టాను.

"అదేం లేదు. పైగా నా పరిశోధనా ఫలితాలను గురించి చర్చించడానికి సమయానికి నా మిత్రుడు రావడం సంతోషంగా ఉన్నది. విషయం చాలా స్వల్పమైనదే. కాని, దీనిలో కొన్ని ఆసక్తికరమైన విషయాలు దాగి ఉన్నాయి."

"అలాగా!"

"నీకు కమిషనర్ పీటర్సన్ తెలుసు కదా?"

"తెలుసు."

"ఇది ఆయనకు సంబంధించినదే."

"ఇది ఆయన ధరించిన టోపీనా?"

"కాదు. ఆయన కనుగొన్నాడు. దాని సొంతదారు ఎవరో తెలియదు...."

"మరి ఆయన ఎవరో తెలుసుకోడానికి కూపీ ఏదైనా దొరికిందా?"

"అది ఎవరో దీనినుంచే రాబట్టాలి."

"ఈ టోపీనుంచా?"

"అవును!"

"మరి ఈ పాత చిరిగిన టోపీ నుంచి ఏం గ్రహించగలవు?"

అతను టోపీని చేతిలోకి తీసుకుని అటూఇటూ పరిశీలనగా చూస్తూ, "దీనిని ధరించిన వ్యక్తి చాలా తెలివైనవాడు అన్నది ఖాయం!" అన్నాడు.

"ఏం జోక్ చేస్తున్నావా హెూమ్స్? నేను అంత మందమతినా? నువ్వు చెప్పేది అసలు అర్థం కావడం లేదు. ఈ టోపీని చూసి, దానిని ధరించిన వ్యక్తి చాలా తెలివైనవాడని ఎలాచెప్పగలవు?" అని అడిగాను.

నా ప్రశ్నకు సమాధానంగా హెూమ్స్, ఆ టోపీని తన తలమీద పెట్టుకున్నాడు. అది అతని నుదుటిని దాటి ముక్కుమీదికి వచ్చి ఆనింది.

"ఇంత పెద్ద బుర్ర గల వ్యక్తి, [redacted] బుర్రలో తప్పకుండా ఏదైనా కొంత కలిగిఉండాలి కదా?" అన్నాడాయన.

[కానన్ డాయల్ రచించిన 'ది బ్లూ కార్బంకుల్' నుంచి]



## చిత్ర ప్రహేళిక

యూరోపియన్లు మొట్టమొదట తమ తీరానికి రావడాన్ని ఒక రెడ్ ఇండియన్ చూస్తున్నాడు.

ఈ చిత్రంలో ఒక పెద్ద పొరబాటు ఉన్నది. అదేమిటి?

# విదేశీయులు తమతీరానికి వచ్చినప్పుడు





## పిక్చర్ క్విజ్

1. కింద కనబరచిన చిత్రం.....
   (i) పేరట్ ఫిష్ (ii) విజ్లర్
   (iii) ఆర్చర్ ఫిష్

2. నీళ్ళ మీద పడుకుని ఈ యువకుడు పుస్తకం చదివేస్తున్నాడు. అతడు పడుకున్నది ప్రపంచంలో కెల్లా అతి ఎక్కువ ఉప్పు గల నీటి తటాకం. దాని పేరు: (ఎ) కాస్పియన్ సముద్రం (బి) మృతసముద్రం (సి) టొరెన్స్ తటాకం.




3. ఇది ఏ దేశాన్ని సూచించే దేశపటం.
   (ఎ) స్పెయిన్ (బి) ఫ్రాన్స్
   (సి) పోర్చుగల్







## బంగారు గడియలు –9 సమాధానాలు.

### ప్రపంచంలో ఎక్కడ ...

(ఎ) కోలా ఎలుగుబంట్లు ఆస్ట్రేలియాలో మాత్రమే ఉన్నాయి.
(బి) సముద్రకన్యవిగ్రహం కోపెన్‌హాగన్ హార్బర్ ముఖద్వారంలో ఉన్నది.
(సి) టుస్సాడ్స్ వాక్స్ మ్యూజియం లండన్‌లో ఉన్నది.
(డి) బంగారుద్వారం వంతెనను దాటాలంటే అమెరికాలోని శాన్‌ఫ్రాన్సిస్కోకు వెళ్ళాలి.

### ప్రశ్నావళి:

1. ముగ్గురు సమానంగా పంచుకున్నారు కాబట్టి ఒక్కొక్కరొట్టెను మూడుముక్కలుగాచేసిఉంటారు. అంటే మొత్తం 24 ముక్కలు. ఒక్కొక్కరు 8 ముక్కలు తిన్నారు. 5 రొట్టెలు గల వ్యక్తి 15 ముక్కలలో (15-8) ప్రయాణీకుడికి ఇచ్చాడు. మూడు రొట్టెలు గల వ్యక్తి (9-8) ముక్కలు ప్రయాణీకుడికి ఇచ్చాడు. కాబట్టి 7 ముక్కలు ఇచ్చిన వ్యక్తికి 7 వెండినాణాలు, ఒక ముక్క ఇచ్చిన వర్తకుడికి 1 వెండినాణెం రావాలి.
2. అప్పుడు వర్షం లేదు.
3. అందరూ చేసేదే వాళ్ళూ చేస్తారు. పారేస్తారు.
4. ఖాళీగా ఉన్న తెల్ల రూమాలుకొసను ఎర్రరూమాలుకొసకు ముడివేయాలి.
6. కొరడా. దానికొస శబ్దానికన్నా వేగంగా పయనిస్తుంది.
7. గ్లాసు. నీళ్ళతో కాకుండా మరే ద్రవంతోనో నింపబడింది.
8. 5వ రోజు నీళ్ళు వలికి పోయాయి. ఇంకా ఎనిమిది రోజులు ఉన్నాయి. అయినా ఒక్కరూ బాధించబడలేదు. అంటే వలికిపోయిన నీరు 8 లీటర్లు మరణించిన మనిషి వాటా.
9. బల్వంత్‌శర్మ పైకెత్తింది ఎడమచేతిని. దెబ్బతిన్నదని చెప్పిన కుడిచేతిని కాదు.




పాండవుల వృత్తాంతం విని ధృతరాష్ట్రుడు పశ్చాత్తాపపడటమూ, రానున్న దానిని గురించి భయపడటమూ శకుని గమనించి, ఆ సంగతి కర్ణుడితో చెప్పాడు. వాళ్ళిద్దరూ దుర్యోధనుడి దగ్గిరికి వెళ్ళి, ముసలిరాజు మథన పడుతున్నమాట చెప్పారు. అది విని దుర్యోధనుడికి దిగులుపుట్టింది.

అప్పుడు కర్ణుడు దుర్యోధనుడితో, "రాజా, నీ తెలివితేటలవల్ల అరణ్యాలలో అష్టకష్టాలూ పడుతూన్న పాండవులు దిగులు పడాలి గాని, వారి రాజ్యం కూడా వశపరచుకుని మహారాజువై సర్వసౌఖ్యాలూ అనుభవిస్తున్న నీకు దిగులెందుకు? పాండవులిప్పుడు ద్వైతవనంలో ఉన్నారట. ఈ స్థితిలో వాళ్ళ దగ్గర నీ వైభవం ప్రదర్శించినట్టయితే వాళ్ళు మరింత ఏడుస్తారు. నీ రాణివాస స్త్రీలను చూసి ఆ ద్రౌపది కుళ్ళిపోవాలి," అన్నాడు.

శకుని కర్ణుడు చెప్పినట్టు చేసిరాలన్నాడు. ఇద్దరి మాటలూ విని దుర్యోధనుడు, "మీ ఆలోచన ఎంతో బాగున్నది. కాని నా తండ్రి మనని ద్వైతవనం వెళ్ళనిస్తాడా అని నా అనుమానం. అసలే ఆయన పాండవుల స్థితి చూసి పశ్చాత్తాపపడుతున్నట్టు మీరు చెప్పారు గద! అందుచేత మనం పాండవుల కష్టాలు కళ్ళారా చూసి ఆనందించటానికి ఉపాయం ఏదన్నా ఉంటుందేమో, మీరు దుశ్శాసనుడితో కూడా ఆలోచించి రేపు ఉదయం నాకు చెప్పండి. మన ప్రయాణానికి భీష్ముడుకూడా ఒప్పుకోవలసి ఉంటుంది మరి. ఆ పెద్ద వాళ్ళిద్దరినీ ఒప్పించే మార్గం ఆలోచించండి," అని చెప్పి శకుని కర్ణులను పంపేశాడు.

మర్నాడు కర్ణుడు వచ్చి, శకుని దుశ్శాసనులు వింటూండగా దుర్యోధనుడితో, "మన గోవులమందలు ద్వైతవనంలో ఉన్నాయి.

33. ఘోషయాత్ర



వాటికి క్రూరమృగాల బాధలేకుండా రక్షించే ఏర్పాట్లు చూడటం నీ విధి. అందుచేత, ద్వైతవనానికి ఆ పని మీద వెళతామంటే ముసలిరాజు తప్పక ఒప్పుకుంటాడు. మనం అర్భాటంగా ద్వైతవనానికి వెళ్ళి, పాండవులను అడలగొట్టి వద్దాం," అన్నాడు.

అందరూ చప్పట్లుచరిచి, కర్ణుడి ఆలోచనను ప్రశంసించారు. వాళ్ళు సమంగుడనే పశువులకాపరిని పిలిచి, "నువ్వు మా వెంట పెద్ద రాజు దగ్గరికి వచ్చి, ఆయనతో మన ఆవులమందలు ద్వైతవనంలో ఉన్నాయని చెప్పు," అన్నారు.

ఆ పశువులకాపరి దుష్టచతుష్టయం వెంట ధృతరాష్ట్రుడి వద్దకు వచ్చి "దేవా, మన ఆవులమందలు ఇప్పుడుద్వైతవనంలో ఉన్నాయి. అక్కడ వాటికి చక్కని మేత ఉన్నది. మందలు క్షేమంగానే ఉన్నవిగాని, వాటికి క్రూరమృగాల బాధ ముందు ముందు లేకుండా కాపాడాలి. ఈ మాట చెప్పటానికే నేను వచ్చాను," అన్నాడు.

అప్పుడు కర్ణశకునులు ధృతరాష్ట్రుడితో, "దుర్యోధనుడు అక్కడికి వెళ్ళి క్రూరమృగాలను వేటాడితే మందలకు క్షేమం కలుగుతుంది. అదిగాక దూడలకు గుర్తులు వేయించటమూ, వాటి పోషణ ఏర్పాట్లు కూడాచూసి రావచ్చు," అన్నారు.

ఆ మాటలువిని ధృతరాష్ట్రుడు, "మందలను క్రూరమృగాల నుంచి రక్షించటమైతే మంచిదేగాని, ఈ సమయంలో ద్వైతవనానికి వెళ్ళటం మంచిపని కాదు. జూదంలో ఓడిపోయి వనవాసం చేస్తున్న పాండవులు ఆ వనంలోనే ఉన్నారు. మీరు అక్కడికి పోతే ఏదో ఒక దురంతం జరగవచ్చు. అందులో మీ తప్పేమీ లేకపోయినా, అపకీర్తి మీకే వస్తుంది. మిగిలిన పాండవుల నుంచి భయంలేదు గాని, భీముడు పగ పట్టిన తాచులాటి వాడు. ద్రౌపది కూడా అలాటిదే. మీరు కూడా తొందరస్వభావం కలవాళ్ళే. మీకూ మీకూ జగడం వచ్చిందంటే చాలా ప్రమాదం కలుగుతుంది. ఇటీవలనే అర్జునుడు స్వర్గానికి వెళ్ళి, దివ్యాస్త్రాలు తెచ్చాడట. మీరు అతనికి చాలరు. అందుచేత గోవుల రక్షణకు మీరు వెళ్ళక, మరెవరినైనా పంపండి," అన్నాడు.

శకుని ధృతరాష్ట్రుడితో, "మేము ఎలాటి ఒడిదుడుకులూ రానివ్వము. అసలుమేము పాండవులున్న ప్రాంతానికే పోము. కొద్ది రోజుల పాటు వనవిహారం చేసి, గోవుల

మండలను పరీక్షించి, మా దారిన తిరిగి వచ్చేస్తాము. పాండవులు కూడా ధర్మరాజు మాట మీరి తొందరపాటు పనులు చేయరు. 'ధర్మరాజు ధర్మమూర్తి' అన్న సంగతి మీకు తెలియనిది కాదు గదా!" అన్నాడు.

ధృతరాష్ట్రుడు ఈ మాటలు నమ్మి,"సరే, వెళ్ళిరండి!" అన్నాడు. దుర్యోధనుడు పరమానందంతో, కర్ణ శకుని దుశ్శాసనులను వెంటబెట్టుకుని, అనేకమంది పౌరులూ, వారి భార్యలూ వెంటరాగా ఘోషయాత్ర మీద బయలుదేరాడు. అతని వెంట అనేక వేల రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ, సైన్యమూ, వేటగాళ్ళూ, వందిమాగధులూ బయలుదేరారు. బళ్ళ మీద రకరకాల వస్తుసామగ్రి వచ్చింది.

కొన్ని రోజులకు వీరంతా ద్వైతవనానికి చేరి, శిబిరం ఏర్పాటుచేసుకున్నారు. మందలన్నిటినీ పరీక్షించి, ఆవులనూ, ఎద్దులనూ, ఆబోతులనూ వేరువేరుగా ఏర్పాటుచేసి, అన్నిటికీ గుర్తులువేసి, గోవులను రక్షించే వారికి తగిన హెచ్చరికలు ఇచ్చి, వారికి బహుమానాలిచ్చి, వారి ఆట పాటల వినోదాలు చూసి ఆనందించారు. శిబిరానికి కావలిసిన పాలూ,పెరుగూ వచ్చాయి. వేటగాళ్ళు వేటాడి మాంసం తెచ్చారు.

దుర్యోధనుడు స్త్రీలనూ, కొడుకులనూ, స్నేహితులనూ వెంటబెట్టుకుని వనవిహారం చేస్తూ, వనసౌందర్యం చూసి ఆనందిస్తూ, ద్వైతవనం మధ్య ఉండే సరస్సు వద్దకు వచ్చి, దాని గట్టున విడిది చేశాడు.

అదే సరస్సు అవతలి గట్టున ధర్మరాజు ఆశ్రమం ఉన్నది. దుర్యోధనుడు చేరిన



సమయానికి ధర్మరాజు తన వెంట ఉన్న బ్రాహ్మణుల సహాయంతో సద్యస్క మనే యజ్ఞం చేయ్యటానికి దీక్షలో ఉన్నాడు.

దుర్యోధనుడి ఆజ్ఞప్రకారం అతని సేవకులు సరస్సు ఇవతలి గట్టున కుటీరాలు నిర్మించే ప్రయత్నాలు ప్రారంభించారు. అప్పుడు, సరస్సుకు రక్షకులుగా ఉన్న గంధర్వభటులు వారికి అడ్డం వచ్చి, "ఇక్కడ ఎవరూ విడియరాదని మా ప్రభువు గారి ఆజ్ఞ. మీరు ఈ చోటువదిలి మరెక్కడనైనా హాయిగా విడుదులు కట్టుకోండి," అన్నారు.

తన సేవకులు వచ్చి ఈ సంగతి చెప్పగానే దుర్యోధనుడు పొగరుగా తన సైనికులను పిలిచి, ఆ గంధర్వ భటులను తరిమివెయ్యమని ఆజ్ఞాపించాడు: వాళ్ళు వెళ్ళి



ఈ లోపుగా గంధర్వులు చిత్రసేనుడి అజ్ఞపొంది దుర్యోధనుడి బలాలను తుక్కు చేసేశారు. ఇదంతా దూరాన్నుంచిచూస్తున్న కర్ణుడు.దుర్యోధనుడు మెచ్చుకోగలందులకు గంధర్వ భటుల మీద యుద్ధానికి వెళ్ళి, కొందరు భటులను చంపాడు.కాని అంతలోనే గంధర్వభటులు వేల సంఖ్యలో వచ్చిపడి కర్ణుణ్ణిచుట్టుముట్టారు. అదిచూసి దుర్యోధనుడి తమ్ములుకర్ణుడికి సహాయం వెళ్ళారు. చిన్న కొట్లాట కాస్తా పెద్దయుద్ధమైకూర్చుంది. చిత్రసేనుడే స్వయంగా యుద్ధానికివచ్చాడు.

చిత్రసేనుడు మాయాయుద్ధం ప్రారంభించేసరికి దుర్యోధనుడి సైనికులు పారిపోసాగారు. దుర్యోధనుడి తమ్ములు వాళ్ళను మళ్ళించటం మొదలుపెట్టారు. కర్ణుడు ఒకడే ధైర్యంగా నిలబడి పోరాడాడు. కాని గంధర్వ సైనికులు అతని రథాన్ని ముక్కలు ముక్కలు చేశారు. కర్ణుడు విరథుడై, వికర్ణుడి రథమెక్కి పారిపోయాడు. దుర్యోధనుడు గంధర్వులకు దొరికిపోయాడు. చిత్రసేనుడు దుర్యోధనుణ్ణి చంపక పెడరెక్కలు విరిచికట్టి వశపరచుకున్నాడు.అది చూసి మిగిలిన గంధర్వులు దుర్యోధనుడి తమ్ములనూ, వారి భార్యలనూ పట్టి బంధించారు.

తమ నాయకులను గంధర్వులు చెరపట్టి తీసుకుపోతూ ఉండటం చూసి, కౌరవసైనికులు ధర్మరాజు ఆశ్రమానికిపరిగెత్తిపోయిఅతనితో,"మహాత్మా, కౌరవకుమారులనూ,వారి భార్యలనూ పట్టుకుని గంధర్వులు గంధమాదన ప్రాంతాలకు తీసుకు

గంధర్వ భటులతో, "దుర్యోధన మహారాజుగారు ఇక్కడ విహారం చేయవచ్చారు. మీరు వెళ్ళిపొండి. లేకపోతే మీ ప్రాణాలు దక్కవు," అని భయపెట్టారు.

గంధర్వభటులు నవ్వి, "మీరు ఎవరిని భయపెడదామనుకుంటున్నారు? మీ మహారాజంటే మేము లక్ష్యపెట్టే వాళ్ళం కాము. మా ప్రభువు చిత్రసేనుడనే గంధర్వరాజు. మీరు మర్యాదగా ఈ చోటువదిలి, అవతల పక్కఉన్న ధర్మరాజు ఆశ్రమం పక్కనో, మరొక చోటనో విడుదులు కట్టుకోండి.ఇది మాగంధర్వరాజు విహరించేస్థలం,"అన్నారు.

ఈ సంగతి విని దుర్యోధనుడు తోక తొక్కిన తాచులాగా అయి, "నన్ను ఆజ్ఞాపించటానికి గంధర్వులెవరు?" అని గంధర్వుల మీదికి తన సైన్యాన్ని యుద్ధానికి పంపాడు.

పోతున్నారు. దయఉంచి వారిని విడిపించు," అని మొరపెట్టుకున్నారు.

భీముడీ మాటలు విని, "కాగల పని గంధర్వులే చేశారు! పెద్దపెట్టున సైన్యాలను కూర్చుకుని, యుద్ధం చేసే అవసరం తప్పింది. కష్టాలలో ఉన్న మంచివారికి దేవుడు అలా సాయపడతాడు," అన్నాడు.

ధర్మరాజు భీముణ్ణి మందలిస్తూ, "ఇలా మాట్లాడటానికి ఇదా సమయం? కౌరవులు ఇప్పుడు మనను శరణుజొచ్చారు. వారిని ఆదుకోవటం మన ధర్మం. మన జ్ఞాతుల భార్యలకు అవమానం జరిగితే మనకు అవమానం కాదా? నేను యజ్ఞదీక్షలో ఉన్నాను గనక, నువ్వూ, అర్జున, నకుల సహదేవులూ, మన పరివారాన్ని వెంటబెట్టుకుని గంధర్వులను వెన్నంటి వెళ్ళి, కౌరవుల భార్యలను విడిపించండి. తొందరపడి గంధర్వులతో యుద్ధానికి దిగవద్దు.వీలయితే మంచి మాటలతో పనిచేసుకురండి. అది సాధ్యం కాక పోతేనే యుద్ధం చెయ్యండి. జ్ఞాపకం ఉంచుకోండి: మనమధ్య కయ్యం వస్తే వారు నూరుగురూ,మనం అయిదుగురమూ: కాని పైవాళ్ళతో కయ్యంవస్తే మనం నూటఅయిదుగురం!" అన్నాడు.

అర్జునుడు ధర్మరాజు చెప్పినట్టే చేస్తామని, భీమ, నకుల సహదేవులతో యుద్ధానికి సిద్ధమై, వేగంగా పరిగెత్తే రథాలెక్కి, గంధర్వులు వెళ్ళిన దారిన బయలుదేరాడు. కౌరవ సైనికులకు ప్రాణాలు లేచి వచ్చాయి.

పాండవులు తమను వెన్నంటి వస్తున్న సంగతి తెలిసి గంధర్వులు ఆగారు. అర్జునుడువారిని సమీపించి, "ఓ గంధర్వులారా,




మీరు పట్టుకుపోతున్న దుర్యోధనుడు మా సోదరుడు. వెంటనే అతన్ని విడిచి పుచ్చండి. ఇది మా అన్న అయిన ధర్మరాజు కోరిక," అన్నాడు.

"ఇలా చేయమని మాకు దేవేంద్రుడి ఆజ్ఞ. ఆయన అజ్ఞ పాలించటం మాధర్మం," అన్నారు గంధర్వులు.

"స్త్రీలను గంధర్వరాజు చెరపట్టటం చాలా అనుచితం. మా మాట విని దుర్యోధనుడు మొదలైనవారినీ, వారి భార్యలనూ విడిచిపెట్టండి. మంచిగా మీరు అలా చేయకపోతే, మీతో యుద్ధంచేసి మావారిని మేము విడిపించుకోవలసి వస్తుంది," అన్నాడు అర్జునుడు.

అయితే గంధర్వులు మంచి మాటలకు లొంగక యుద్ధానికి సిద్ధమయ్యారు.

పాండవులకూ, గంధర్వులకూ యుద్ధం ప్రారంభమయింది. దుర్యోధనుణ్ణీ, అతని తమ్ముళ్ళనూ పట్టుకున్నట్టే, పాండవులను కూడా పట్టుకోవాలని గంధర్వులు ఆ పాండవులను చుట్టుముట్టారు. కాని పాండవుల మీద ఈ ఎత్తు పారలేదు. అర్జునుడు గంధర్వ సైనికులను తన బాణాలతో తీవ్రంగా గాయపరచసాగాడు; వాళ్ళు తనపై విసిరిన ఆయుధాలను మధ్యదారిలో సునాయాసంగా విరగగొట్టాడు.

యుద్ధం మధ్యలో చిత్రసేనుడు, "అర్జునా, నన్ను గుర్తించలేదా? నేను చిత్రసేనుణ్ణి. నీ స్నేహితుణ్ణి. ఈ దుర్మార్గుడైన దుర్యోధనుడు మీకూ, ద్రౌపదికీ తన వైభవం ప్రదర్శించి, బాధించటానికి ఘోషయాత్ర నెపంతో తన పరివారాన్ని వెంటబెట్టుకుని ద్వైతవనానికి బయలుదేరాడు. అది తెలిసి దేవేంద్రుడు వీళ్ళందరినీ పట్టి, స్వర్గానికి తీసుకురమ్మని నన్ను పంపాడు. అందుచేత ఆయన ఆజ్ఞ నిర్వర్తిస్తున్నాను," అన్నాడు.

దానికి అర్జునుడు, "ఇతను దుర్మార్గుడే గాని, మా దాయాది. ఇతన్ని విడిపించుకు రమ్మని మా అన్న ధర్మరాజు మమ్మల్ని ఆజ్ఞాపించాడు. ఆయన ఆజ్ఞ నెరవేర్చడం నా ధర్మం. నువ్వు మా ధర్మరాజు దగ్గరికి వచ్చి ఆయన చెప్పినట్టు చేస్తే బాగుంటుంది. నీ మిత్రుడిగానూ, శిష్యుడిగానూ ఈ మాట అడుగుతున్నాను," అన్నాడు.

చిత్రసేనుడు అర్జునుడు మొదలైన వారి వెంట ఆశ్రమానికివచ్చి, ధర్మరాజుతో జరిగినదంతా చెప్పాడు. అంతా విని ధర్మరాజు, "గంధర్వరాజా, మీరు దుర్యోధనుణ్ణి చంపక పోవటం నిజంగా మా అదృష్టం. మా కులానికి గొప్ప ఆపద తప్పింది. మిమ్మల్ని చూడటం నా కెంతో సంతోషంగా ఉంది. మీరు నా విన్నపం మన్నించి దుర్యోధనాదుల నందరినీ వెంటనే విడిచిపుచ్చండి," అని వేడుకున్నాడు.

చిత్రసేనుడు ధర్మరాజు కోరినట్టే కౌరవులను విడిచిపుచ్చి, సపరివారంగా స్వర్గానికి వెళ్ళిపోయాడు.

తరవాత ధర్మరాజు దుర్యోధనుణ్ణి దగ్గరికి పిలిచి, "బాబూ, ఎప్పుడూ ఇలాటి సాహసం చేయకు. అందువల్ల సుఖం కలగదు. జరిగిన దానికి విచారించక, అంతఃపుర స్త్రీలతో ఇంటికి తిరిగి వెళ్ళు," అన్నాడు.



# చందమామ కబుర్లు

## మదర్ థెరీసా తపాలాబిళ్ళ

మదర్ థెరీసాకు 1979లో నోబెల్ శాంతి బహుమతి లభించింది. 1980లో మన ప్రభుత్వం అత్యున్నతమైన 'భారతరత్న' పురస్కారంతో ఆమెను సత్కరించింది. ఆ తరవాత ఆమె గౌరవార్థం మనదేశం ప్రత్యేకంగా తపాలాబిళ్ళను వెలువరించింది. ఆమె నోబెల్ బహుతిని స్వీకరించిన తరవాత స్వీడన్ దేశం ఆమె పేరు మీదుగా తపాలా బిళ్ళను విడుదల చేసింది. ఇప్పుడు మధ్య ఇటలీలోని ప్రపంచంలోనే అతి ప్రాచీనమైన రిపబ్లిక్‌గా పేరుగాంచిన శాన్‌మరీనో, మదర్‌థెరీసా గౌరవార్థం 'యురోపా' అనే స్టాంపును విడుదల చేసింది. ఈ స్టాంపులో ఆమె ఫోటోకు బదులు సుప్రసిద్ధ చలనచిత్ర నటి గీనా



లొల్లో‌బ్రిగిడా గీసిన మదర్ థెరీసా చిత్రపటం, ఆమె సంతకంతో చోటు చేసు కుంటున్నది. మదర్ థెరీసా దీ కలకత్తా - అనే పేరుతో వెలువడే ఈ స్టాంపు విలువ 750 లీరా. 1975వ సం॥లో అంతర్జాతీయ ఆహార సంస్థ ఏర్పాటు చేసిన సిరిస్ మెడల్‌లో కూడా మదర్ థెరీసా బొమ్మ ఒకవైపున ఉన్నది. ఈ పతకాన్ని "అందరికీ ఆహారం" అనే లక్ష్యంతో, ఆకలిని రూపుమాపడానికి కృషిచేసే వారికి అందజేస్తారు.

## పెరిగిన విద్యార్థులు

కలకత్తాలోని సాత్ పాయింట్ ఉన్నతపాఠశాల ప్రారంభించి ఇప్పటికి నలభైమూడేళ్ళయింది. 1954వసం॥లో దానిని ప్రారంభించినప్పుడు ఆ పాఠశాల విద్యార్థుల సంఖ్య 17. ప్రస్తుతం ఆ పాఠశాలలో దాదాపు 12,000 మంది విద్యార్థులు చదువుతున్నారు!

## సినిమాపిచ్చి!

మిధున్‌దేవాంగన్, ముంబాయిలోని ఒక పెద్ద హోటల్‌లో వంటచేసే ఉద్యోగం చేస్తున్నాడు. ఇటీవల బాగా నడిచిన ఒక హిందీ సినిమాను ఒకే థియేటర్‌లో వరసగా 200 సార్లు చూశాడీ మహానుభావుడు! ఇందుకు అతడు ఖర్చుపెట్టిన డబ్బు ఎంతో తెలుసా? ఐదువేల రూపాయలు! ఇప్పుడు కూడా తీరికా, అవకాశం ఉన్నప్పుడల్లా అతడా సినిమాను చూస్తూనే ఉన్నాడు!

## అరుదైన క్రిస్మస్

పౌర్ణమి, క్రిస్మస్ కలిసిరావడం చాలా అరుదైన విషయం. గత డిసెంబర్‌లో వచ్చిన క్రిస్మస్ అటువంటి అరుదైన క్రిస్మస్. గత 20 శతాబ్దాలలో ఇటువంటి అరుదైన క్రిస్మస్ 70 సార్లే వచ్చింది. 20వ శతాబ్దంలో ఐదుసార్లు అంటే - 1901, 1920, 1931, 1977, 1996 సంవత్సరాలలో పౌర్ణమి, క్రిస్మస్ కలిసి వచ్చాయి. మరోసారి పున్నమిరేయి క్రిస్మస్ వేడుకలు జరుపుకోడానికి ఇంకా 19 సంవత్సరాలు అంటే, 2015వసం॥ వరకు వేచి ఉండాలి.

చందమామ అనుబంధం-100

మనదేశపు చెట్లు

# జీడిమామిడి

ఈనాడు జీడిపప్పు, జీడినూనెవ్యాపారంలో ప్రపంచంమొత్తంమీద మన దేశానిదే పైచేయి. 90శాతం వ్యాపారం మనదేశంనుంచే జరుగుతున్నది!

బ్రెజిల్ దేశానికి చెందిన జీడిమామిడిని, దాదాపు నాలుగువందల సంవత్సరాలకు పూర్వం పోర్చుగీసులు మనదేశంలో ప్రవేశ పెట్టారు. దక్షిణ రాష్ట్రాలన్నిటిలోనూ వ్యాపించి ఉన్నప్పటికీముంబాయినుంచి కన్యాకుమారి వరకు గల పశ్చిమ సముద్రతీరంలో జీడి పంట విరివిగా పండుతన్నది. దేశం మొత్తం మీద పండే పంటలో 70 శాతం ఇక్కడే పండుతున్నది. ఎక్కువ ఉష్ణోగ్రత, చలిలేని వాతావరణం, ఇసుక నేలలు జీడిమామిడికి అనువైనవి.

గుబురుగా 15మీటర్ల ఎత్తుపెరిగే ఈచెట్లు 30-40 సంవత్సరాలు బతుకుతాయి. వీటి ఆకులు వెడల్పుగానూ, మందంగానూ ఉంటాయి.ఇవి పసుపుపచ్చ ఎరుపురంగులలో డిసెంబర్ నుంచి మార్చ్‌వరకు గుత్తులు గుత్తులుగా పూస్తాయి. మార్చ్ నెలలో కాపుకు వస్తాయి. కాయలు ముదిరి పండడానికి 60-70 రోజులు పడుతుంది. జీడివిత్తనం కాయకు వెలుపల ఉండడం వృక్షశాస్త్రంలోనే చిత్రమైన విశేషం! విత్తనం చుట్టూ ఉన్న దృఢమైన పెంకు లేతగా ఉన్నప్పుడు పచ్చగా ఉంటుంది. ముదిరేకొద్దీ ఊదారంగుకు మారుతుంది. జీడిమామిడి పండును కూడా తింటారు. మామూలుగా ఒకచెట్టు, ఒక రుతువులో 30-35 కి.గ్రా. కాయలు కాస్తుంది. జీడిప్పలో ఇనుపశక్తి, ఏ విటమిను మొదలైన పోషకపదార్థాలు పుష్కలంగా ఉన్నాయి.దీనిని పచ్చిగానూ, వేయించీ తింటారు.

బెంగాలీలో దీనిని హిజ్లీ బాదాం అనీ; హిందీ, మరాఠీ, గుజరాతీ భాషలలో కాజూ అనీ; తమిళంలో ముందిరి అనీ; తెలుగులో కొన్ని ప్రాంతాలలో ముంతమామిడి అనీ; మలయాళంలో కాషు –అండీ అనీ అంటారు.

జీడిపప్పు పైపెంకుల నుంచి తీసే నూనె వ్యాపారరీత్యాచాలా విలువైనది. జీడిమామిడి కలపను పడవల నిర్మాణానికీ, పెట్టెలు తయారుచేయడానికీ ఉపయోగిస్తారు.



మనదేశపు ఋషులు:

# వాలఖిల్యులు

తపోబలం సాధించడానికి దేహప్రమాణం అవరోధం కాదని నిరూపించిన వాలఖిల్యులు సప్తర్షులలో ఒకడైన క్రతువు అనే ముని కుమారులు. అంగుష్ఠప్రమాణ దేహులైన వీరు అరవైవేలమంది. ఈ మునికుమారులు ఒకటిగా చెట్ల కొమ్మలకు తల్లకిందులుగా వేలాడుతూ తపస్సు చేసేవారు!

ఒకప్పుడు కశ్యప ప్రజాపతి యజ్ఞం తల పెట్టాడు. ఆ యజ్ఞానికి మునులు, ఇంద్రాది దేవతలు విచ్చేసి సకల సహాయాలు అంద జేశారు. వాలఖిల్యులు కూడా తమ వంతు సాయం చేయాలని యజ్ఞానికి కావలసిన ఎండుపుల్లలు, పువ్వులు సేకరించి తెచ్చారు. బొటన వేలెడంత లేని ఆ మునికుమారులు వాటిని తేవడానికి కూడా కిందా మీదా పడ సాగారు. వారి స్థితిని చూసి ఇంద్రుడు పకపకా నవ్వాడు. ఆ నవ్వు వాలఖిల్యులకు వేదన కలిగించింది. వారు ఆగ్రహించి, అహంకారి అయిన ఇంద్రుడికి పోటీగా మరొక ఇంద్రుణ్ణి సృష్టించాలన్న సంకల్పంతో తపస్సుకు ఉప క్రమించారు.

దానిని చూసి ఇంద్రుడు భయపడి, వారి తపస్సును ఆపించమని కశ్యపుణ్ణి ప్రార్థించాడు. కశ్యపుడు కోరగా వాలఖిల్యులు తమ సంకల్పాన్ని ఉపసంహరించుకున్నారు. అయినా, వారు అంతవరకు చేసిన తపో ఫలితాన్ని కశ్యప – వినతా తనయుడైన గరుడుడు స్వీకరించాడు.

ఉత్తరోత్తరా అమృతం కోసం గరుడుడు స్వర్గానికి వెళ్ళినప్పుడు అతన్ని అడ్డుకోవ డానికి ఇంద్రుడు ప్రయత్నించి ఓడిపోయాడు. ఆవిధంగా ఇంద్రుణ్ణి పదవీచ్యుతుణ్ణి చేయా లన్న తపోసంపన్నులయిన వాలఖిల్యుల కోరిక కొంతవరకు నెరవేరింది!

ఒకనాడుగరుడుడు యథాలాపంగా ఒక వృక్షం మీద వాలాడు. ఆ వృక్షం కొమ్మలలో వాలఖిల్యులు తల్లకిందులుగా వేలాడుతూ ధ్యానంలో ఉన్న సంగతి ఆయన గమనించ లేదు. కొమ్మవిరిగింది. అప్పుడు సంగతి గ్రహించి గరుడుడు దానిని నేలమీద పడకుండా, వేళ్ళతో పట్టుకుని ఆకాశంలో తిరగ సాగాడు. ఆఖరికి కశ్యపుడి సలహా ప్రకారం వాలఖిల్యులకు ధ్యానభంగం కలగ కుండా ఆ కొమ్మను జాగ్రత్తగా గంధమాదన పర్వతం మీదికి చేర్చాడు!



# మీకు తెలుసా?

1. మూడువందల సంవత్సరాలకు పైగా రష్యాను పరిపాలించిన రాజకుటుంబం ఏది?
2. ఏ దేశానికి చెందిన ప్రజలు షింటో మతాన్ని అనుసరిస్తున్నారు?
3. ఐక్యరాజ్యసమితి పతాకంలో వున్న రంగులు ఏవి?
4. తిమింగిలానికి ఎన్ని దంతాలున్నాయి?
5. సాధికారమైన 'పవిత్రబైబిల్' ఏ సంవత్సరం నుంచి ఉపయోగంలోకి వచ్చింది?
6. దబేనది సంగమించే సముద్రం ఏది?
7. మనదేశంలోని ఎత్తయిన రోడ్డు ఏది?
8. పక్షులకు పళ్ళున్నాయా?
9. 'సప్తఋషుల' పేర్లు తెలుసా?
10. ఆర్యభట్ట ఎవరు? ఆయన ఎందులో ప్రసిద్ధుడు?
11. మనదేశంలో గవర్నర్ పదివిని అలంకరించిన మొట్టమొదటి మహిళ ఎవరు?
12. 'వీరభద్ర విజయం' అనే తెలుగుకావ్యం రచించిన వారెవరు?
13. ఇండియా మొట్టమొదటి వైస్రాయ్ ఎవరు?
14. తిరువళ్ళువర్ రచించిన 'తిరుక్కురళ్' అనే సుప్రసిద్ధ తమిళ గ్రంథంలో మూడు భాగాలున్నాయి. అవి ఏవి?
15. ఫ్రెంచివిప్లవ నినాదం ఏమిటి?
16. వింబుల్డన్ బిరుదును సాధించిన మొట్టమొదటి నీగ్రో క్రీడాకారిణి ఎవరు?

## సమాధానాలు

1. రోమనోవ్‌లు.
2. జపాన్.
3. నీలం, తెలుపు.
4. 200.
5. 1611.
6. నల్ల సముద్రం.
7. జమ్మూ-కాశ్మీర్‌లోని లేహ్ నుంచి నీబ్రా లోయకు గల 18,300 అడుగుల ఎత్తయిన రోడ్డు.
8. లేవు.
9. అత్రి, అంగీరసుడు, క్రతువు, మరీచి, పులహుడు, పులస్త్యుడు, వసిష్ఠుడు.
10. చంద్రగుప్త విక్రమాదిత్యుని కాలానికి చెందిన (క్రీ.శ. 476-520). సుప్రసిద్ధ గణిత శాస్త్ర వేత్త; ఖగోళశాస్త్రవేత్త. 'సున్న' ప్రాముఖ్యతను తెలియచేసి ఈనాటి ఆల్జీబ్రాకు పునాదులు వేసినవారు.
11. సరోజిని నాయుడు: ఉత్తర ప్రదేశ్.
12. బమ్మెరపోతన.
13. లార్డ్ కానింగ్.
14. ధర్మం: అర్థం: కామం.
15. స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం.
16. అమెరికాకుచెందిన అల్థియా గిబ్సన్. ఆమె వింబుల్డన్ సింగిల్స్ టైటిల్‌ను 1956-1957లో సాధించారు.



# మంత్రాల మహంకాళయ్య

చోడవరం గ్రామంలో మల్లమ్మ అనే ఆవిడ ఉండేది. ఆమె భర్త ఒక చిన్న రైతు. వారికి ముచ్చటగా ముగ్గురుపిల్లలు. భర్తకు చేదోడు వాదోడుగా వుంటూ, అత్తమామలను అపురూపంగా చూసుకుంటూ, ఏ చీకూ చింతా లేకుండా ఉండేదామె.

ఉన్నట్టుండి ఒక రోజున మల్లమ్మ మంచాన పడింది. లంఖణం పరమౌషధం- అనుకుని, ఏ మందులూ ఇప్పించక మొదట్లో ఆమెను పస్తులుంచారు. నీరసించి పోయింది కాని, మల్లమ్మకు జబ్బుతగ్గలేదు. ఇక లాభం లేదని, పొరుగూరి వైద్యుడు మంగాచారిని పిలిపించారు. ఆయన ఇచ్చిన కషాయం, గుళికలు పనిచెయ్యలేదు.

ఈస్థితిలో, పిలవని పేరంటంగా మంత్రాల మహంకాళయ్య వచ్చి, మల్లమ్మకేసి కొంచెం సేపు కన్నార్పకుండా చూసి, మల్లమ్మ భర్తతో, "నీ భార్యకు పట్టింది దయ్యం, రోగంకాదు. ఆ దయ్యం కూడా మరేదో గ్రామానిదికాదు, మన గ్రామానిదే-చుక్కమ్మ!" అన్నాడు.

చుక్కమ్మ పేరు వింటూనే అక్కడ ఉన్న వాళ్ళతో పాటు మల్లమ్మ భర్త బెదిరిపోయాడు. ఈ చుక్కమ్మ అర్నెల్లకిందట చీకటిపడుతున్న వేళ చెరువుకు నీళ్ళకు పోయి తిరిగిరాలేదు. తెల్లవారాక ఆమెశవం చెరువులో తేలుతున్నది. గ్రామంలో కొందరు అది ఆత్మహత్య అన్నారు. మరికొందరామెనీళ్ళఅంచునవున్న పాకుడు రాళ్ళమీద కాళ్ళుమోపి జారి నీట మున్గిపోయిందన్నారు.

"అయితే, చుక్కమ్మదయ్యం అయిందంటావా?" అన్నాడు మల్లమ్మ భర్త వణుకుతూన్న గొంతుతో.

"కాకేం చేస్తుంది మరి? పొద్దుకుంకేవేళ, గ్రామానికి తూర్పు వేపున వున్న చెరువులో మునిగిపోయిన వాళ్ళు, దయ్యాలవుతారని శాస్త్రం చెబుతున్నది!" అని మహంకాళయ్య

రామవరపు గణేశ్వరరావు

తిరిగిచూడకుండా అక్కణ్ణించి వేగంగా వెళ్ళి పోయాడు.

మహంకాళయ్య, మల్లమ్మకు దయ్యం పట్టిందన్న మరుక్షణం నుంచీ, అందరికీ మల్లమ్మలో ఆ లక్షణాలు కనిపించసాగాయి. పిల్లలు అల్లరిచేస్తే, అసలే నీరసంగా ఉన్న ఆమెకు కోపం వచ్చి అరిచేది. ఆ అరుపులు, కేకలు దయ్యంపట్టిన లక్షణాలే అన్నారు.

ఈ గొడవంతా విన్న ఊరి బడిపంతులు రామయ్య, మల్లమ్మభర్తతో, "భూతవైద్యుల బడాయి మాటలు పట్టించుకోకండి. శుభ్రంగా మూడు పూటలా తిండి పెట్టండి. బలంవస్తే మల్లమ్మమామూలుమనిషిలా తిరుగుతుంది." అని సలహా ఇచ్చాడు.

ఆ సలహా మల్లమ్మభర్తతో పాటు ఎవరికీ నచ్చలేదు. ఒక బంధువు, ఆంజనేయుడి పేరు చెబితే దయ్యం తారుకుని పారిపోతుం దంటే, ఒక రాత్రివేళ ఆరుబయట రామాయణం తోలుబొమ్మలాట మల్లమ్మ ముందు ఆడించారు. నిద్ర ముంచుకురావడంతో మల్లమ్మ, ఆ ఆటను కొద్దిసేపు మాత్రమే చూడగలిగింది.అదిచాలదని మర్నాడు ఒక కోతులాడించేవాణ్ణి పిలిపిస్తే, వాడు మూడు కోతులచేత మూడుగంటల పాటు ఆటలాడిం చాడు. అదిచూసి అంత జబ్బులోనూ మల్లమ్మ విరగబడి నవ్వింది. అది మల్లమ్మకు పట్టిన దయ్యంనవ్వే అన్నారు కొందరు.

ఇది కాదని మల్లమ్మ భర్తా, బంధువొ కాయనా చెరువుకట్ట పక్కన ఉన్న మహం కాళయ్యపూరిపాకకువెళ్ళారు.మహంకాళయ్య, వాళ్ళనుచూస్తూనే, "మీరు ఏదో ఒకనాడు, నా దగ్గరకు వస్తారని తెలుసు. ఒకవేళ మీరు రాకపోయినా, నేనే వచ్చి వుండేవాణ్ణి. ఎందు కంటే ఇంతగొప్పభూతవైద్యుణ్ణి నేనుగ్రామంలో వుండగా, దయ్యం మనుషులనుపట్టి పీడిం చడం నాకు అవమానకరం!" అన్నాడు.





"కాళయ్యా!ఆదయ్యంతోలుబొమ్మలాటలో అంజనేయస్వామిని చూసికూడా, నా భార్యను వదిలిపోలేదు!" అన్నాడు మల్లమ్మభర్త దిగులుగా.

"ఈ చిన్న విషయానికి ఆంజనేయులవారి పేరు ఉచ్చరించడం అపచారం!" అంటూ మహంకాళయ్య చెంపలువేసుకుని,"అస్వామి, శాకినీ,ఢాకినీ పిశాచాలమీద తనబలం ప్రయోగిస్తాడుగాని, ఊరిదయ్యం చుక్కమ్మలాంటి దానిమీద మెరుపులాంటి తనవాలాన్ని ఝుళిపిస్తాడా? అజ్ఞానంఅంటే ఇదే!"అంటూ సంచీ ఒకటి భుజానికి తగిలించుకుని వాళ్ళవెనక బయలుదేరాడు.

అతడు ఇంట్లో ప్రవేశిస్తూనే పెద్దగా ఏవో మంత్రాలుచదివి, సంచీలోంచి పసుపు కుంకుమలూ, నిమ్మకాయలూ తీశాడు. తర్వాత పసుపుకుంకుమలతో నేలమీద ముగ్గువేసి, దానిమీద పెట్టిన పీటపైన మల్లమ్మను కూర్చోబెట్టాడు. ఈ పని పూర్తయ్యాక వినీ వినబడ కుండా ఏవో మంత్రాలు చదువుతూ, నిమ్మకాయలు కోసి మల్లమ్మ తలమీదుగా అటూ ఇటూవిసిరి, వేపమండలు తీసుకుని మల్లమ్మ తలమీదా, వీపుమీదా కొట్టసాగాడు.

ఆ సమయంలో, పట్నంలో చదువుకుంటున్న మల్లమ్మ తమ్ముడు వెంకటేశం,అక్కకు ఒంట్లో బాగాలేదని చూడవచ్చాడు. అతడు జరుగుతున్న ఘోరంచూసి,మహంకాళయ్యను "కొట్టకు, ఇక ఆగు!" అంటూ గద్దించాడు.

మహంకాళయ్య వేపమండల్ని జారవిడిచి, వెంకటేశం కేసి చురచుర చూస్తూ, "బస్తీ చదువులు కుర్రవాళ్ళను పాడు చేస్తాయనడానికి, ఇతడే సాక్ష్యం! సరే, రేపు ఈ వేళకే వస్తాను," అని క్షణం ఆగి, మల్లమ్మభర్తతో, "రేపు పొద్దున స్వయంపాకం పంపేటప్పుడు, ఐదురూపాయలతో పాటు ఎక్కడా తెల్లఈక అంటూ లేని నల్లకోడిపెట్టను పంపడం మరవకు," అని సంచీ భుజాన వేసుకునివెళ్ళిపోయాడు.

ఆ పగలంతా వెంకటేశం, తన బావనడిగి జరిగిందంతా తెలుసుకున్నాడు. ఇరుగు పొరుగులు అతడికి చెరువులో బలవన్మరణం చెందిన చుక్కమ్మ దయ్యమైందని చెప్పారు.

ఆ రాత్రి మహంకాళయ్య చాలా పెద్దవేప మండలు తీసుకుని వచ్చాడు. వస్తూనే సంచీలోని సరంజామా అంతా నేలమీద పరచి, పెద్దగొంతుతో, "దారినపోయే దానక్క,దయ్యమా, దా! మసిబూసుకున్న మరిడమ్మా దా!బూడిద

బుగ్గల భూతమ్మా,దా!చెక్కమ్మ చెల్లి చుక్కమ్మా, దా!" అని కేకలువేస్తూ, మల్లమ్మ కేసి వేప మండలు ఝుళిపించాడు.

ఆ మరుక్షణం, తెరిచిఉన్న వాకిలిలోంచి వెంకటేశం, రెండు చేతుల్లో రెండు చింత బరికెలు పట్టుకుని, సుడిగాలిలా లోపలికి జొరబడి, గంతులేస్తూ, "ఒరే, మహంకాళా! నేను, నువ్వు రమ్మన్నదయ్యాల్లో దేన్నీకాను. చింతబరికెల శాయమ్మను! చుక్కమ్మ నా తోబుట్టువు. ఆ రోజది చెరువులో మునిగి పోతుంటే, నువ్వు కట్టెక్కి వినోదిస్తున్నావట. ఆ చుక్కమ్మిప్పుడు, నీ పూరిపాకకు నిప్పు పెట్టడానికి పోయింది. ఈ తెల్లవారు జామున వేగుచుక్క పొడిచేలోపల, నువ్వు గ్రామం వదిలి పారిపోకపోయావో, నిన్ను చింతనిప్పు ల్లోవేసి, వేయించుకు తింటాను!" అన్నాడు.

ఇంతసేపూ వెంకటేశం మాటలను నిలు వెల్లా కంపించిపోతూ, గుడ్లప్పగించివింటున్న మహంకాళయ్య కదిలి ద్వారం కేసి పోతూ, "దణ్ణాలు, దణ్ణాలు శాయమ్మా! క్షమించు!" అంటూ బయటికి పరిగెత్తబోయాడు.

వెంకటేశం, అతడి దారిని అడ్డగించి, చింతబరికెలతో నాలుగుబాది వీధిలోకి తరిమే శాడు. ఆ సమయంలో అక్కడ చేరిన వాళ్ళం దరూ, "అంతా ఏదో చోద్యంగావుందే!" అనుకోసాగారు.

అలసిపోయిన వెంకటేశం, ఒక చెంబెడు మంచినీళ్ళు తాగి, అక్క మంచం పక్కన కూర్చున్నాడు. అప్పుడు అతడిబావఆశ్చర్యంగా, "ఏరా, వెంకూ! చుక్కమ్మ తోబుట్టువు శాయమ్మ కూడా దయ్యమయిందా? ఇంతకూ ఆవిడ నిన్నెందుకు పట్టినట్టూ?" అని అడిగాడు.

"బావా! నమ్మే మూర్ఖులుంటే చచ్చి పోయిన వాళ్ళందరూ దయ్యాలే! బండెడు ఇంటి చాకిరీకి తోడు సరైన తిండిలేక అక్క జబ్బు పడింది. త్వరగా నీ పెద్ద కొడుక్కు పెళ్ళి చేసి కోడల్ని తెచ్చుకో. ఆవిడ అక్కకు ఇంటి పనుల్లో సాయంగా ఉంటుంది.నేను అక్కను రేపే పట్నం తీసుకుపోతున్నాను. అక్కడ మంచి వైద్యులున్నారు. ఒక్క నెల రోజుల్లో అక్కను ఎప్పటి మనిషిలా చేసి తీసుకువస్తాను," అన్నాడు.

"అంతా నీఇష్టం, మీఅక్క ఇష్టం!"అంటూ మల్లమ్మభర్త,ఆప్యాయంగా వెంకటేశం వీపు తట్టాడు.





# పుల్లన్నశాస్త్రి పంచాంగం

ఒకానొకప్పుడు, వియ్యంపేట జమీందారు యదుకృష్ణరాయణంగారు, తన కుమారుడికి యువరాజు పట్టాభిషేక మహోత్సవం ప్రకటించాడు. నాలుగు రోజుల పాటు జరిగిన పట్టాభిషేక మహోత్సవానికి, కానుకలమీది ఆశతో,బంధువులను వెంటబెట్టుకుని కవులు, పండితులు, పురోహితులు, కళాకారులుచాలా మంది వచ్చారు.

జమీందారు వారివారికున్న పేరుప్రఖ్యాతులనుబట్టి వరుసక్రమంలోసన్మానాలజాబితా ఒకటి తయారు చేయించి,దాని ప్రకారం ఎవరినీ విడిచిపెట్టకుండా, అందరినీ తగిన రీతిలో సత్కరించాడు. అయితే, పురోహితుల జాబితావచ్చేసరికి, పుల్లేటికుర్రు నుంచి వచ్చిన పుల్లన్నశాస్త్రి అనే పురోహితుడు తన పేరుభారీ సంభావనలు ముట్టజెప్పబడే ఘనాపాఠీల పక్కనగాక,సామాన్య పురోహితులస్థాయి జాబితాలో చివరచేర్చబడడం చూసి ఉడుక్కున్నాడు.

ఆయన తన పేరు రాగానే యువరాజు వద్దకు వెళ్ళి, యువరాజు ఇచ్చిన నాలుగు వరహాలసంభావనపుచ్చుకుని, "ప్రభూ! మీరేవో కానుకలిస్తారని, ఈ నాలుగు రోజుల నుంచీ నేను ఎదురుచూడ్డం లేదు. నా గ్రామంలో పంచాంగం పట్టుకుని ఇల్లిల్లూ తిరిగి తిథి, వారం, నక్షత్రం చెప్పినా, ఇంతకంటే ఎక్కువ సంపాయించగలను. నేను మిమ్మల్ని కించ పరచడం లేదనుకుంటే, మీ గ్రామంలో ఒక పురోహితుడుగా, ఇప్పుడు మీరిచ్చిన సంభావనను మీకు కానుకగా చదివిస్తున్నాను. శతమానం భవతి!" అంటూ ఆశీర్వదించి, సంభావనను యువరాజు చేతిలో పెట్టేశాడు.

అక్కడున్న వారందరికీ పుల్లన్నశాస్త్రి అహంకారంచూసి కోపంవచ్చింది. అయితే జమీందారు మాత్రం ప్రశాంతంగా, "జమీందారు నదిలాంటివాడు. ఆశ్రితులను వారు వారు తెచ్చుకున్న పాత్రల పరిమాణాన్నిబట్టి నది

మార్కండేయ కుమారి

నీరిచ్చినట్టే, మేము కూడా వినికిడిని బట్టి తయారుచేసిన జాబితా ప్రకారం సంభావన లివ్వడం జరిగింది. మీరింతకన్నా ఎక్కువ సత్కారానికి పాత్రులైతే చెప్పుకునే విధానం ఇది కాదు. నీరు తక్కువ వచ్చిందనిపాత్రను నదిలోకి విసిరేస్తే నష్టపోయేది నది కాదు. ఏది ఏమైనా ఈ సమయంలో మీ ప్రవర్తన క్షంతవ్యంకాదు," అన్నాడు.

పుల్లన్నశాస్త్రి సిగ్గుపడ్డాడు. సభాముఖంగా ఆయన తన ప్రవర్తనకు క్షమాపణ చెప్పుకున్నాక, జమీందారు ఆయనను పరీక్షించి, అన్ని విధాలా యోగ్యుడని ప్రశంసించి,తగిన విధంగా సత్కరించాడు. పుల్లన్నశాస్త్రి పట్టాభిషేక మహోత్సవం ముగిశాక, పుల్లేటికుర్రు గ్రామానికి వచ్చేశాడు.

అహంకారంతో చేసిన పనైనా,యువరాజుకే కానుకలు చదివించిన విషయం, పుల్లేటికుర్రులో అందరినీ ఆకర్షించి, పుల్లన్నశాస్త్రిని గ్రామంలో ప్రముఖుణ్ణి చేసింది. దాంతో ఆయనకు గర్వం మరింతగా పెరిగిపోయింది. జమీందారునే ధిక్కరించి సన్మానం పొందడం ఆయన గొప్పగా భావించాడు.

అనాటి నుంచీ ఆయన ధనిక, పేద అనే తేడా చూడకుండా పెళ్ళి చేయించినా,వ్రతం చేయించినా – పురానికిహితంకోరేవాడు పురోహితుడు, అన్నమాట మరిచి, ఒకటికి రెండురెట్లు సంభావనను గుంజేవాడు.

ఇలా ఉండగా– పుల్లేటికుర్రులో వుండే తిక్కన అనే కవి తండ్రి కాలంచేశాడు. తిక్కన, జమీందారు ఆశ్రయ కవులలో ఒకడవడం చేత, జమీందారు పదకొండవరోజు కర్మకాండకు హాజరయ్యాడు.

అది ముగిశాక, పట్టలేని విచారంలో మునిగి ఉన్న తిక్కనను చూసి జమీందారు, "మీరు పండితులు.అన్నీ తెలిసినవారు. తండ్రిలేనిలోటు తీర్చలేనిదే! అయినా మీరింతగా



దిగులు పడిపోకూడదు," అన్నాడు. అందుకు తిక్కన, "ప్రభూ! ఈ ఇల్లు నా తండ్రి కష్టపడి కట్టుకున్నాడు.అందువల్లనే, చివరిక్షణంవరకు ఆయనను ఈ ఇంట్లోని మంచం మీద వుంచాను. ఆయనపోయిననక్షత్రంమంచిది కాదు.ఇంటినినాలుగునెలలపాటు వదిలెయ్యా లని పురోహితులవారు చెబుతున్నారు. మంచి నక్షత్రాలు,చెడ్డనక్షత్రాలు అంటూ, మనం కట్టుకున్న ఇంట్లో కాలధర్మం చెందే అవకాశం లేని మానవజన్మ గురించి విచారిస్తున్నాను," అన్నాడు.

జమీందారు ఆయనకేసి జాలిగా చూసి, అప్పటికప్పుడు పుల్లన్నశాస్త్రితో పాటు మరి కొందరు పెద్దలను సమావేశపరిచి, వాళ్ళతో, "నాకు మీరొక సహాయం చెయ్యాలి. వాస్తు శాస్త్రరీత్యా, ఈ తిక్కనగారిల్లు చాలా బావుంది. నాకు కొంతకాలంపాటు, ఈ ఇంట్లో వుండా లన్న కోర్కె కలిగింది. అందుకు కారణం ఇక్కడికి రాగానే నాలో ఏదో ప్రశాంతత కలి గింది. ఎన్నాళ్ళుగానో గూడుకట్టుకుని వున్న అశాంతీ, ఆందోళనాభావాలు పటాపంచ లయినై. కానీ కవిగారు, ఈ ఇల్లు విడిచి పెట్టాలని మీరు చెప్పినట్టు విన్నాను. దీనికి మార్గాంతరం ఏమైనా వుంటే చెప్పండి!" అన్నాడు.

పుల్లన్నశాస్త్రి పెద్దలతో చర్చించి, జమీందా రుతో, "ప్రభూ! శాస్త్రాలు, ఆచారాలు ఆపస్తం భుడనే ముని ప్రవేశపెట్టాడు. అయితే, దేశ కాల పాత్రానుగుణంగా వాటిని మార్చుకోమని ఆయన చెప్పిన విషయం మాకు సమ్మతమే! కవిగారింటికి ఉదకశాంతి చేయించుకుంటే దోషంపోయి,నివాసయోగ్యమవుతుంది,"అన్నాడు.

జమీందారు ముసిముసి నవ్వులు నవ్వి, వెంటనే పుల్లన్నశాస్త్రి ఆధ్వర్యంలో ఉదకశాంతి జరిపించి, తిరిగి వెళ్ళిపోతూ, పుల్లన్నశాస్త్రితో, "మన ఆచార వ్యవహారాలలో అనాగరికం, ప్రస్తుతకాలానికి అభ్యంతరకరమైనదేమైనా వుంటే, వాటికి మార్గాంతరాలు సూచిస్తూ పంచాంగాలలో వివరణ ఇవ్వండి. నేను ఘనంగా సన్మానించి, మంచి బహుమతి ఇవ్వదలచాను," అన్నాడు.ఈ విధంగా, తిక్కన ఇల్లు వదిలిపోనవసరం లేకపోయింది. పుల్లన్నశాస్త్రి, పండితులతో చర్చించి, శుభా శుభకార్యాలలో సులువైన మార్పులు సూచిస్తూ పంచాంగం తయారుచేసి, జమీందారుచేత ఘనంగా సన్మానించబడ్డాడు.





# భూమయ్య సమస్య

కుబేరపురంలో, భూమయ్య అనే పేరెన్నిక గన్న బట్టల వ్యాపారి వుండేవాడు. ఆయనకు అనుకూలవతి అయిన భార్య, చేతికంది వచ్చిన కొడుకు, రూపవతీ, గుణవతీ అయిన కూతురు గల కుటుంబం. ఆయన కూతురు లక్ష్మిని, పొరుగూరు ధాన్యం వ్యాపారి అయిన శేషయ్యకొడుకుక్కిచ్చి ఘనంగా పెళ్ళిచేశాడు.

ఆ తర్వాత ఆయన వ్యాపారాన్ని కొడుకు రమణయ్యకు అప్పగించాడు.అత్తవారింట కూతురు సుఖంగా కాపురం చేస్తున్నది.తండ్రి అప్పగించిన బట్టల కొట్టును వృద్ధి చేసి, విజయవంతంగా నడిపిస్తున్నాడు రమణయ్య.

ఈవిధంగా, ఏ చీకూచింతాలేని సంసారం భూమయ్యది. అయితే, హాయిగా కాలుమీద కాలువేసుకుని, కులాసాగా కబుర్లు చెబుతూ వుండవలసింది పోయి, ఎప్పుడూ తనగదిలో ఒంటరిగా కూర్చుని, దిగులుగా వుండసాగాడు భూమయ్య.

క్రమంగా ఆయనకు ఆకలి మందగించింది. వేళకు సరిగా భోజనం చేయడంకూడా మానుకున్నాడు. రాత్రిళ్ళు నిద్ర పోకుండా, తనలో తను ఏదో గొణుక్కుంటూ వుండడం ప్రారంభించాడు. భార్యగాని, కొడుకుగాని పలకరిస్తే, విసుక్కోవడం మొదలుపెట్టాడు.

భూమయ్య పరిస్థితి చూసి, ఆయన భార్య బెంబేలు పడిపోయి, చాలా మంది వైద్యులకు ఆయనను చూపించింది. అన్ని పరీక్షలూ చేసి, ఆయనకు ఎలాంటి వ్యాధీ లేదని, వాళ్ళు తేల్చి చెప్పారు. ఒక వేళ తన భర్తకు గాలిసోకిందేమోనని భూమయ్యభార్య, భూతవైద్యులను కూడా రప్పించి మంత్రాలు వేయించింది; తాయెత్తులు కట్టించింది.ఎన్ని చేసినా భూమయ్యలో మార్పులేదు.

ఇలావుండగా – తీర్థయాత్రలు ముగించుకుని, ఒకసారి భూమయ్యను చూసిపోదామని, ఆయన వియ్యంకుడు శేషయ్య వచ్చాడు.

జి.సి. జీవి



ఆయనను చూస్తూనే భూమయ్యభార్య కళ్ళ నీళ్ళుపెట్టుకుని, "అన్నయ్యా,మీబావఆరోగ్యం ఈ మధ్య ఏమీ బావుండడంలేదు, వెనకటి రోజులేనయం. ఈ ఊరుకు వచ్చిన కొత్తలో, బట్టలమూట నెత్తినపెట్టుకుని, వీధి వీధి తిరిగి అమ్ముకు వచ్చేవాడు. చాలీచాలని అద్దెకొంపలో వుండేవాళ్ళం. వచ్చే ఆదాయం సరిపోయేది కాదు. అయినా, ఎంతో ధీమాగా, కులాసాగావుండేవాడు. అదృష్టం కలిసొచ్చింది. బట్టలకొట్టుతెరిచాము. కొడుకు ప్రయోజకుడై తండ్రి వ్యాపారాన్ని చూసుకుంటున్నాడు. అమ్మాయి మీఇంటసుఖంగా వున్నది. ఇప్పుడా యనకుఏసమస్యలూ లేవు!" అంటూ, ఇప్పటి భీమయ్య పరిస్థితిగురించి వివరంగా చెప్పింది.

ఆమె చెప్పిందంతా శ్రద్ధగా విన్న శేషయ్య, కాసేపు ఆలోచించి, "నువ్వేమీ దిగులు పడ కమ్మా, ధైర్యంగావుండు! మీ గ్రహబలంబాగు న్నట్టులేదు. త్వరలోనే అంతా సర్దుకుని,బావ మళ్ళీ మామూలు మనిషి కాగలడనే నమ్మకం నాకుంది," అని ధైర్యం చెప్పి, భూమయ్యను పలకరించి, తనఊరుకు వెళ్ళిపోయాడు.

పక్షం రోజులు గడిచాయోలేదో, ఒకనాటి ఉదయం, మూటాముల్లే సర్దుకుని, ముక్కు చీదేస్తూ పుట్టింటికి చేరుకున్న కూతురు లక్ష్మిని చూసి నివ్వెరపోయింది, భూమయ్య భార్య.

"ఏం జరిగిందే, తల్లీ? ఇట్లా చెప్పాపెట్ట కుండా ఒంటరిగా ఊడిపడ్డావు. మీ అయ నతో ఏమైనా గొడవ పడ్డావా?" అనిఅడిగింది భూమయ్యభార్య.

"ఏం చెప్పనమ్మా! మీ అల్లుడికి వ్యాపా రంలో తీరని నష్టం వచ్చింది. అప్పులవాళ్ళ బాధకు తట్టుకోలేక బైరాగుల్లో కలిసిపోయాడు. ఇక తిరిగిరానని చీటీ కూడా రాసి పెట్టి మరీ ఇల్లొదిలి వెళ్ళాడు," అంటూ లక్ష్మి శోకాలు పెట్టసాగింది.

గదిలో వుండి ఇదంతా విన్న భూమయ్య, విసురుగా బయటికి వచ్చి, "నీ మామ, ఆ శేషయ్య ఏం అఘోరిస్తున్నాడు?" అని కోపంగా కూతురును ప్రశ్నించాడు.

" మీకు ముఖం చూపించలేనని దిగులుగా గదిలో ముసుగుతన్ని పడుకున్నాడు, నాన్నో!" అంటూ లక్ష్మి కుమిలి కుమిలి ఏడవసాగింది.

"ఇక ఊరుకో, తల్లీ! ఆ శేషయ్యకొడుకు సన్యాసుల్లోకలిసినా, బైరాగుల్లో చేరిపోయినా, వెదికి మెడపట్టుకు లాక్కొస్తాను. నువ్వే చూద్దువుగాని," అంటూ భూమయ్య, గదిలో ఒకమూలగా గోడకు ఆనించివున్న చేతికర్ర

తీసుకుని, బాడుగబండిలో వియ్యంకుడి ఊరుకు ప్రయాణమయ్యాడు.

ఆయన, శేషయ్య ఇంటి గడప ఎక్కుతూనే, శేషయ్యను గట్టిగాకేకవేసిపిలిచి, గది లోంచి బయటకువచ్చిన శేషయ్యను చూస్తూనే చేతికర్రను గడపమీద గట్టిగా తాటించి, "లక్ష్మి చెప్పగా నీ కొడుకు నిర్వాకం విన్నాను. ఇక ఇప్పుడు చేయవలసిందేదో చేయాలి గాని, ముసుగు బిగించి పడుకుంటే సరి పోతుందా? పద, ఇద్దరం వెళ్ళి వెతుకుదాం," అంటూ శేషయ్యను బైలుదేరదీశాడు.

ఇద్దరూ కలిసి ఆ చుట్టుపక్కల వున్న ఆశ్రమాలూ, మఠాలూ వెదికి, ఒక మఠందగ్గర బైరాగివేషంలోవున్న లక్ష్మిభర్తను పట్టుకున్నారు.

శేషయ్య, కొడుకుతో ఏదో చెప్పబోయేంతలో, భూమయ్య కల్పించుకుని, "ఏమయ్యా, అల్లుడూ! ఆశ్రమాలూ, మఠాలూ, ఈ బైరాగి వేషాలూ, అంతో ఇంతో దైవభక్తి వున్న వాళ్ళ కోసంగాని – వ్యాపారంలో నిలువునా దివాళా ఎత్తిన వాళ్ళకోసం కాదు. వ్యాపారం అన్న తర్వాత లాభనష్టాలు సహజం, అల్లుడూ! నష్టం వచ్చిందని ఇంటినీ, కట్టుకున్న ఇల్లాలినీ వదిలి పోతారా ఎవరైనా? మళ్ళీ మంచి ధాన్యంకొని వ్యాపారం ప్రారంభించు. కావలసినపైకం నేను సర్దుతాను; అప్పుగానే అనుకో!" అని అల్లుడికి నచ్చజెప్పి, అతడితో పాటు వియ్యంకుడు శేషయ్యను కూడా తనఇంటికి తీసుకువచ్చాడు.

బైరాగి వేషంలోనే అయినా, తిరిగి వచ్చిన భర్తను చూసి, లక్ష్మి అమితానందం చెందింది. భూమయ్య, అల్లుడికీ, కూతురుకూ కొత్త బట్టలుపెట్టి, శేషయ్య చేతికి పాతికవేలు ఇస్తూ, "బావగారూ! ఈ డబ్బుతో నీకొడుకును మళ్ళీ ధాన్యం వ్యాపారం ప్రారంభించమను. నువ్వు కూడా ఉట్టినే చేతులు కట్టుకుని ఇంటివాసాలు లెక్కపెట్టకుండా, మా అల్లుడికి వ్యాపారంలో సాయపడుతూండు. అతడికింకా వ్యాపారానుభవం చాలదని, నా నమ్మకం!" అన్నాడు చిన్నగా నవ్వుతూ.

ఈ మాటలకు శేషయ్య కూడా నవ్వుతూ, డబ్బును తిరిగి భూమయ్యచేతిలో పెట్టి, "మా వాడు వ్యాపారంలో నష్టపోయిందేమీ లేదు, బావా! కొడుక్కు బట్టలవ్యాపారం అప్పగించాక, ఎప్పుడూ ఇంట దిగులుగా కూర్చునే నీలో మార్పుతెచ్చేందుకు, నేనూ, నా కొడుకూ కలిసి ఆడిన నాటకమిదంతా!" అన్నాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

**ఈ పోటీల వ్యాఖ్యలు 1997 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటింపబడును.**



S.G. SESHAGIRI



S.G. SESHAGIRI

* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * ఫిబ్రవరి నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. * వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:
చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026

## డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఎవరూలేని చోట!
రెండవ ఫోటో : ఒకరి కొకరు బాసట!!
పంపినవారు : జి.వి. రాఘవేంద్రరావు
టెల్లర్, స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా
మచిలీపట్నం - 524 002 కృష్ణాజిల్లా (ఆం.ప్ర)

## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 72-00
చందా పంపవలసిన చిరునామా :
డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - **600 026**

Printed by B.V. REDDI at Prasad Process private Ltd., 188, N.S.K. Salai, Madras - 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras - 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

